# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై

## గర్భరక్షక

స్త్రీలు బలహీనలగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి పుష్ఠిగ పాలు పడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

# కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్ కు ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు.

# మెట్రిక్ పద్ధతి
## అంటే ఏమిటి?




పొడవు కొలవడంలో మూల ప్రమాణం మీటరు కనుక ఈ పద్ధతిని మెట్రిక్ పద్ధతి అన్నారు. ఇతర దశాంశ పద్ధతులలో లాగానే, దీనిలో కూడా మూల సంఖ్య పది. పొడవును గాని, బరువును గాని, పరిమాణాన్ని గాని చూసేటప్పుడు గుణించవలసి వచ్చినా, భాగించవలసి వచ్చినా, ఈ సంఖ్యనే (పది) ఉపయోగించాలి.

ఈ మెట్రిక్ పద్ధతిలో మూల ప్రమాణానికి గుణిజం చూసేటప్పుడు డెకా (10 రెట్లు), హెక్టో (10×10 = 100 రెట్లు), కిలో (10×10×10 = 1,000 రెట్లు) అనే మాటలు 'మీటరు'కు ముందు జేర్చి చెప్పాలి. మూలప్రమాణంకంటె చిన్న లెక్కలు చెప్పాలంటే, డెసి (1/10), సెంటి (1/100), మిల్లి (1/1,000) అనే మాటలు ముందు జేర్చాలి.

**మెట్రిక్ పద్ధతి**
**తూనికలు, కొలతలు**
**1958 అక్టోబరునుండి**
**ప్రవేశపెడతారు**

**మెట్రిక్ కొలతలు తెలుసుకోండి**

పొడవు కొలవడానికి
మూల ప్రమాణం
**మీటరు**
= సుమారు 40 అం.
1 కిలోమీటరు = 5 ఫర్లాంగులు

**చిన్న ప్రమాణాలు**

10 మిల్లిమీటర్లు = 1 సెంటిమీటరు
10 సెంటిమీటర్లు = 1 డెసిమీటరు
10 డెసిమీటర్లు = 1 మీటరు

**పెద్ద ప్రమాణాలు**

10 మీటర్లు = 1 డెకామీటరు
10 డెకామీటర్లు = 1 హెక్టోమీటరు
10 హెక్టోమీటర్లు = 1 కిలోమీటరు

DA 58/109

2

భారత ప్రభుత్వం వారిచే జారీచేయబడినది




వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలలోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాంటిది.




## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళ నాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

---

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౩౧]   సెప్టెంబరు 1958   [సంచిక ౯

# విషయసూచిక





## కుమారి గీత

కీర్తిశేషులైన శ్రీ కే. జి. మీనన్ I. C. S. గారి కుమార్తె కుమారి గీత నాట్యాచార్య శ్రీ జి. ఎల్లప్పన్ గారి సుశిక్షణపొంది మద్రాసు మ్యూజియం హాలులో కేరళ ఆర్ట్సు సెంటరు యాజమాన్యమున 28-8-58 నాడు ప్రప్రథమంగా భరతనాట్య ప్రదర్శన మిచ్చెను.

ఆమె రూపలావణ్యములతో బాటు అలవడిన సుశిక్షణ, సమగ్రమగు కళాకౌశలము, శాస్త్రీయ విజ్ఞానములు ప్రొఫెసర్ పి. సాంబమూర్తిగారన్నట్లు ఆ నాటి భరతనాట్య అరంగేట్రమును పరిపూర్ణమైనదిగా నొప్పించినది.

చి|| కుమారి గీతకు భావ, అభినయ, తాళ, పదజ్ఞానములు సమానస్థాయిలో నలవడుటచే ఉత్తమశ్రేణికి చెందిన కళాకారిణిగా రాణించినది.

భగవంతుని అనుగ్రహముతోటి, పెద్దల ఆశీస్సులతోటి, రసికుల ఆదరాభిమానములతోటి కుమారి గీత కళాపిపాస, ఓర్పు, పట్టుదలలతో మరింత కళాకౌశలమును, మహోజ్వల భవిష్యత్తును సాధించగలదని ఆశిస్తున్నాము.




కేసరి హైస్కూలు (త్యాగరాయనగరు)లో 'నాగిరెడ్డిహాలు' ప్రారంభోత్సవ సందర్భమున 15–8–58న తీసిన ఛాయా చిత్రము. వరుసగా ఆసీనులయినవారు సినిమా నటుడు శ్రీ జగ్గయ్య, దివాన్ బహదూర్ బండి శ్రీ హరిరావు నాయుడు, ప్రధానోపాధ్యాయిని, శ్రీమతి అంజలీదేవి, మద్రాసు ముఖ్యమంత్రి, మద్రాసు మేయరు, శ్రీ బి. నాగిరెడ్డి, డాక్టరు టి. యం. బి. నెడుంగాడి, డాక్టరు యస్. శేషగిరిరావుగార్లు.




జయజయ గృహలక్ష్మీ మైత్ర సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## సంఘసేవలో శిక్షణ



జాతీయ శ్రేయోపురోభివృద్ధులకు సంఘసేవాశిక్షణ స్త్రీలకు, పురుషులకు కూడ సమానంగా అత్యవసరము. విజ్ఞాన శాస్త్రాధ్యయనము, పరిశోధనలపట్ల ఎక్కువ ఆసక్తి చూపుతున్న యీ కాలంలో విద్యలో విజ్ఞానశాస్త్రమున కేకాక సౌందర్యకళా పిపాసలు, హృదయపరివర్తనము, ఆధ్యాత్మికచింత, సుహృద్భావములకు సమాన ప్రాముఖ్యత అమరవలసియున్నది. ఇవి మానవునకు పరస్పర సన్నిహితసద్భావములను, సానుభూతి సహకారములను విశాల దృక్పథమును, సునిసిత మైన యూహాపోహలను సమకూర్చగలవు. ఇవి లోపించిననాడు మానవత్వము లోపించగలదు. ముఖ్యంగా బాలికలలోని సౌకుమార, సునిసిత భావాలు, స్వభావము నశించకుండా సుశిక్షితులను చేయగల విద్య కావలసియున్నది.

అనుభవజ్ఞుడు, విజ్ఞానగనియనదగిన డాక్టరు సి. పి. రామస్వామి అయ్యర్ సంఘసేవ ఒక కళ, విజ్ఞానశాస్త్రమని వివరించారు. ఆయన అన్నట్లు యీ నాడు సంఘసేవపట్ల ఏర్పడిన ఆసక్తికి స్వభావసిద్ధంగా మానవునిలోని మానసిక పరివర్తనము సంఘంలోని పరస్పర సన్నిహిత సంబంధము కారణమనదగును. ఒకప్పుడు సంఘసేవ పరిమిత స్థాయిలోనున్నా యీ నాడు మాత్రం అవసరాలు, అవకాశాలు విస్తృతమైనాయి.

ఇప్పటి సంఘసేవ ప్రజల ప్రతియొక్క సమస్యకు సంబంధించినది. గృహావసతులు, ఆహారం, ప్రసూతి సౌకర్యాలు, ఆరోగ్యం యిత్యాది సమస్యలనన్నిటిని సేవాసక్తితో సంఘసేవకులు ఎదుర్కొనవలసియున్నది. కాబట్టి సంఘసేవలో శిక్షణ పొందువారు వైద్యులుగాను, విజ్ఞానశాస్త్రజ్ఞులుగాను, కళాకారులుగాను, రైతులుగాను శ్రామికులుగాను దేశంలో అన్నిరంగాలలో కృషిచేయవలసియున్నది. అనేక సాంఘిక సమస్యల పరిష్కారమునకు తోడ్పడుటకు సరళహృదయము, విశాలదృక్పథము కావలసియున్నది.

సంఘసేవలో శక్తి సామర్థ్యాలతోబాటు చిత్తశుద్ధి, అనుభవవిజ్ఞానములు, ఓర్పు, దీక్షలు ప్రధానములు. సేవాసంస్థలు సమర్థంగా పనిచేయలేక పోవుటకు ఆర్థిక వసతులలోటని మాత్రం అనుకోడం పొరబాటు. సేకరించిన, అమరిన అవకాశములనైనా సాంఘికావసరాల కనుగుణంగా వినియోగించుటకు నిజాయితీ, చిత్తశుద్ధి, అనుభవవిజ్ఞానములు ఓర్పు, దీక్షలలో నేది సంఘసేవకులలో లోపించినను సేవాకార్యక్రమాలు సమర్థమని, ఫలప్రదమని యనిపించుకోవు. సంఘసేవకుల స్వార్థరహితమైన సేవాసక్తి, ప్రేమానురాగాలతో నిండిన మనోప్రవృత్తి, విశాల హృదయము సాంఘికావసరములను తీర్చి, సమస్యల పరిష్కారమునకు తీవ్రగతిన తోడ్పడగలవు ఇది అభివృద్ధి అభ్యుదయాలకు రాజబాట.

సంఘసేవా శిక్షణకని ఏర్పడిన సంస్థలు, సంఘసేవపట్ల ఆసక్తి చూపుతున్నవారు పై విషయాలను గుర్తించి సంఘసేవయొక్క పరిపూర్ణ ఆదర్శలక్ష్యాల సిద్ధికి అనువుగా తమ కార్యక్రమాలను, కార్య కలాపాలను రూపొందించుకోగలరని ఆశిద్దాం!

— (o) —

# మద్రాసులో తెలుగు బాలబాలికల విద్యకు కేసరి ఎడ్యుకేషన్ సొసైటి కృషి



ఆగస్టు 15 వ తేది నాడు స్వాతంత్ర్య దినోత్సవంతోబాటు మద్రాసులో — త్యాగరాయనగరు కేసరి హైస్కూలులో మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజనాడార్, ప్రముఖ చలనచిత్ర నిర్మాత శ్రీ బి. నాగిరెడ్డిగారి భూరి విరాళముతో నిర్మించబడిన 'నాగిరెడ్డి హాలు'ను, మద్రాసు మేయరు శ్రీమతి తారాచెరియన్ గారు ప్రముఖ సినిమానటి శ్రీమతి అంజలిదేవి భూరివిరాళముతో ఏర్పాటయిన 'అంజలిదేవి లేబరటరీ'లను ప్రారంభోత్సవము చేసిరి. ఈ సందర్భమున శ్రీ బి. నాగిరెడ్డిగారి చిత్రపటమును మద్రాస్ ముఖ్యమంత్రి ఆవిష్కరించిరి.

కేసరి విద్యాసంఘ కార్యదర్శి, కేసరి విద్యాలయముల కరస్పాండెంటు దివాన్ బహదూరు బండి శ్రీహరిరావుగారు తమ స్వాగతోపన్యాసములో నిట్లుచెప్పిరి.

"ఎనిమిది సంవత్సరాల క్రిందట అద్దె ఇంటిలో ప్రాథమిక పాఠశాలగా ప్రారంభమైన ఈ పాఠశాల ఇప్పుడు విజయ వాహినీ స్టూడియోల అధిపతి శ్రీ బి. నాగిరెడ్డిగారి సహాయంతో ఉన్నత పాఠశాల అయింది. ప్రభుత్వం ఈ పాఠశాలకు 1950లో త్యాగరాయరోడ్ ప్రక్కగా 2½ యకరాలస్థలం మంజూరు చేశారు. 1951 లో రు. 35 వేలఖర్చుతో నిర్మాణాలు పూర్తిఅయి 1952 లో పాఠశాలను మాధ్యమిక పాఠశాలగా మార్చారు. అప్పుడు పాఠశాలకు సమీపంలో 3 యకరాలు ఆటస్థలంగా లభించింది. అప్పటినుండి తిరుపతి దేవస్థానం ఇచ్చిన రు. 10 వేలు ఇతరుల సహాయంతో ప్రాథమిక పాఠశాల భవనం నిర్మించారు. శ్రీ వెంకటేశ్వర హాలు నిర్మాణానికి రు. 20 వేలు ఖర్చు అయింది. శ్రీ నాగిరెడ్డి గత ఏప్రిల్‌లో ఒకరోజు వచ్చి పాఠశాలనుచూచి నేను అనుకోకుండా, అడగకుండా దీనిని ఉన్నత పాఠశాలగా మార్చేందుకు రు. 25 వేలు ఇస్తానని చెప్పారు. నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ మర్నాడే శ్రీ నాగిరెడ్డి తమ కుమారుని ద్వారా రు. 4 వేలు పంపి కంట్రాక్టర్లు శ్రీ సత్యనారాయణ రెడ్డిగారికి పాఠశాల భవన విస్తరణపనికి పూనుకోవలసిందిగా చెప్పారు. వారు ఇంతవరకు రు. 30 వేలు ఖర్చుచేశారు. అదేగాక రు 4 వేలు నగదుగనూ, మరో రు. 4 వేలు ఖర్చుచేసే బల్లలు, కుర్చీలు సరఫరా చేశారు. ఒక టైపురైటరు, కాంపౌండుకు ముళ్లకంచ సరఫరా చేశారు.

'శ్రీ నాగిరెడ్డి హాలు' మూడు తరగతులకు పనికి వస్తుంది. వీనస్ స్టూడియోవారు రు 1000లు, గానన్ డంకర్లీ రు. 500 లు, శ్రీ తల్లం వీరయ్య చెట్టి అండు సన్స్ రు 500 ల విలువగల వేదికను ఇచ్చారు. శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరిగారు సహాయం చేశారు. జూన్ 19 నుండి పాఠశాలలో నాల్గవ ఫారం ప్రారంభమైంది.

కేసరి విద్యాసంస్థ నిర్వహిస్తున్న మూడు పాఠశాలలలో 1183 విద్యార్థులున్నారు. (747 బాలురు 436 బాలికలు) ఈ పాఠశాలను హాలీవుడ్ పాఠశాల అంటూవుంటాను. కారణం ఇక్కడ చదివే పిల్లలతాలూకు పెద్దలు సినిమా పరిశ్రమతో సంబంధం కల్గివున్నవారే.

ఈనాడు ఇక్కడ చేరిన పెద్దలందరిలో ఒక విశిష్టలక్షణం వుంది. అది వారందరూ స్వయంగా కృషివలన పైకివచ్చినవారు. మాటలకంటే చేతలకు ప్రాధాన్యం ఇచ్చేవారు. డాక్టరు కేసరిగారి గుప్తదానాలు మీకు తెలిసేవున్నాయి. ఇప్పుడు నాగిరెడ్డి గారు మరొక గుప్తదాత. కామరాజు ముక్తసరిగా మాట్లాడేవారు. వారు' పార్కులాం' అంటేనే అదొక హామీ. శ్రీమతి అంజలీదేవి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యా

లయానికి రు. 25 వేలు ఇచ్చారు. మరో 8 వేలు ఈ పాఠశాల సైన్సు లేబొరేటరీ నిమిత్తం ఇచ్చారు” అని శ్రీ హరిరావు నాయుడుగారు చెప్పారు.

పాఠశాల అభివృద్ధికి ఉదారంగా విరాళం ఇచ్చి తోడ్పడవలసిందిగా శ్రీ గోగినేని వెంకటేశ్వరరావు, శ్రీ వి. రామకృష్ణలాంటి పారిశ్రామిక వేత్తలకు శ్రీ కె. జగ్గయ్య, శ్రీమతి జి. వరలక్ష్మి మొదలైన సినిమా నటీనటులకు, తదితర ఆంధ్ర తమిళదాతలకు కేసరి విద్యాసంస్థ తరపున శ్రీ శ్రీ హరిరావు నాయుడు విజ్ఞప్తిచేశారు.

మద్రాసు ముఖ్య మంత్రి కామరాజనాడార్ సామాన్య ప్రజానీకానికి విద్యా సౌకర్యములను విస్తృతంచేయడం పెద్ద సమస్యయినా విద్యా వ్యాప్తి ఆవశ్యకతను గుర్తించి శ్రీ బి. నాగిరెడ్డిగారు కేసరి విద్యాలయమునకు సహాయంచేసి నగరంలో యితరులకు మార్గదర్శకుడయ్యారు. విద్యావిజ్ఞాన వసతుల సమకూర్చడంలో మద్రాసు ప్రభుత్వము భాషా భేదములను పాటించక అన్ని వర్గాలవారికి సమానావకాశములు కల్పించగలదన్నారు.

మద్రాసు మేయరు శ్రీమతి తారాచెరియన్ ప్రారంభంలో స్వాతంత్ర్యదిన శుభకాంక్షలు తెలియజేసి ప్రతియొక్కరు దేశసౌభాగ్యముకొరకు కృషిచెయ్యాలన్నారు.

“శ్రీ బి. నాగిరెడ్డిగారికి సత్కార్యాలకు సహాయంచేసేవారనే కీర్తివుంది. ఈ పాఠశాలకు విరాళంఇచ్చి మంచి సత్కార్యం చేశారు. విద్యాదానమునకు మించిన దానంలేదు. ఈ పాఠశాలలో సగంమందికిపైగా ఆడపిల్లలు వుండటం సంతోషంగా వుంది. ఆడపిల్లల చదువుకు ఇంకా ఎక్కువ సౌకర్యాలు, శ్రద్ధ అవసరం. విద్యా సౌకర్యాలు కలిగించవలసిన బాధ్యత ప్రభుత్వందే అయినా శ్రీ నాగిరెడ్డిలాంటివారు పూనుకొని ఇతరులకు మార్గదర్శకులయ్యారు. శ్రీ హరిరావునాయుడు రిటైరు అయినా తమ కాలమును ఇల్లాంటి సత్కార్యాలకు వినియోగించటం చాలా ముదావహంగావుంది. ఇలాంటి సంస్థలకు ప్రజలు ముందుకువచ్చి సహాయంచేయాలి.

ఈ పాఠశాలను కళాశాలగా మారినప్పుడు కళాశాల సంఘానికి మరో రు. 25 వేలు ఇస్తానని శ్రీ నాగిరెడ్డి నాతో చెప్పారు, నగరంలో ఆంధ్రులు అల్పసంఖ్యాకులైనా అనాదిగా ఆంధ్రులు, తమిళులు సోదరులవలె మెలిగారు. మన దేశంలో ప్రతివారికి వారికి ఇష్టంవచ్చిన ప్రాంతంలో నివసించే స్వేచ్ఛ వుంది. పరిపాలనా సౌకర్యంకోసంమాత్రం రాష్ట్రాల పునర్విభజన జరిగింది.

చలనచిత్ర పరిశ్రమకు గౌరవస్థానం ఏర్పడింది. అందులో పనిచేసేవారు అనేక సత్కార్యాలకు తోడ్పడుతున్నారు.” అని చెప్పి లాంఛనంగా శ్రీమతి తారాచెరియన్ ‘అంజలీదేవి లేబొరేటరీ’ని ప్రారంభించారు.

పాఠశాల ప్రధానోపాధ్యాయురాలు శ్రీమతి వసంతలక్ష్మి వందనము లర్పించిన తరువాత జాతీయ గీతాగానంతో కార్యక్రమం ముగిసింది.

—o—

మార్క్ ట్వైన్ యింటికి ఆయన స్నేహితుడొకడువచ్చి చిందర వందరగా పడియున్న పుస్తకాల్ని చూచి “మిత్రమా! యిదేమిటి - మంచి మంచి పుస్తకాలన్నీ యిలా పడేస్తే ఎందుకూ కాకుండాపోవూ! దుమ్ము దులిపి బీరువాలో సర్దకూడదూ!” అన్నాడట.

“పుస్తకాలనంటే మిత్రులు ఎరువిచ్చేవారున్నారుకాని బీరువాలను ఎరువిచ్చేవారు ఎవరూ కనుపించలేదు” అన్నాడు మార్క్ ట్వైన్

అల్లంకి చెల్లారాం

# రాజకుమార్

ఫ్రెంచి మూలం : తెలుగు అనువాదం :

అంటోని డె సయింట్-ఎక్స్యుపెరీ డాక్టర్ వి. ఎన్. శర్మ



(గతసంచిక తరువాయి)

రాజకుమార్. నా యీ విషమావస్థలో నాదగ్గరే వుండిపోవటం ఒక విధంగా మంచిదే అనుకోవచ్చు. ఇదంతా ఎడారి. సామాన్యమైన ఎడారయితే దరీదాపు లనేవి వుంటాయి. ఇవ్వాళకాకపోతే, రేపో, ఎల్లుండో ఏదో విధంగా అవతలికి చేసుకోవచ్చు. కాని ఇసుకతో ఇది మహా సముద్రానికి మల్లెవుంది. నరపురుగు ఎక్కడా కానరాదు. మనుష్యజాతికన్నా రెట్టింపు గట్టివి జంతుజాలాలు, పక్షుల మూతాలు. వాటికి సాధకబాధకాలు బాగా తెలుసు. అంచేతనే అవి ఇటుకేసి రావటానికే మానుకున్నాయి. తిండిదొరకటం దుర్లభం. అంతకన్నా దుర్లభమైంది తాగటానికి నీళ్లు లభించటం. ఎడారుల మధ్య పుష్కలంగా జలవసతి వుంటుందని, అందు మూలాన కన్నుల పండువుగా తోటలూ, పైర్లూ పెరుగుతూవుంటాయని అంటారు. అలాటి ప్రకృతి దృశ్యాలను నాప్రపంచ యాత్రల్లో అనేకసార్లుచూసి ఆనందించానుకూడా! కాని అదంతా ఒక లోకం. ఇది ఒక లోకం. ఈ రెంటికి అవినాభావసంబంధం అనేది ఎల్లా సాధ్యమవుతుంది ? ... ...

అబ్బాయి వచ్చింది - అంతకన్నా నా ముందర పైనుంచి వూడిపడిచేరుకున్నాడని అనటమే మంచిది అనుకుంటాను - మరో ప్రపంచంనుంచి. వాడు సూచించిన ఆనవాళ్లనుబట్టి వాడు ఇక్కడ వూడిపడింది మరో గ్రహమండలాన్నుంచి. నేను వాడికిచ్చిన మేక బొమ్మ, ఆ బొమ్మ విశ్రాంతి దీసుకోటానికితయారుచేసి ఇచ్చిన పెట్టె, తన గ్రహమండలంలో జాగ్రత్తపరచుకోటానికి తావువుండదని, తన లోకాన్నుంచి ఆ కబురూ, ఈ కబురూ చెపుతూవున్నప్పుడు అన్నాడు. అంటే గ్రహమండలాల్లో కొన్ని చిన్నవి, ఒకచిన్న బొమ్మపెట్టెనే అమర్చుకోటానికి ఇరుకుగా వుండేవికూడా వుంటాయన్నమాట.

ఆ గ్రహమండలాలను గురించి నా బుర్రలో ఎన్నెన్నో ఆలోచనలు రేకుత్తుతూ వున్నాయి ఆ సంగతి విన్న తరువాత. అవంతా ఒక చోట నిలకడగా వుండిపోయేవా! వాయువేగ మనోవేగాలతో ఆపళాన అక్కడినుంచి ఇక్కడికి, ఇక్కడినుంచి అక్కడికి విధివిరామం లేకుండా ప్రయాణంచేస్తూ వుంటాయి. ఖగోళ శాస్త్రజ్ఞులు వాటి గమనం, అంతా

కాకపోయినా, కొంత వరకైనా పసి కట్టారు ఆ యంత్రాలను. ఈ పనికోసం ప్రత్యేకంగా తయారుచేసి. అహోరాత్రాలూ తదేక దీక్షతో ఆ పరికరాలను వుపయోగిస్తూ, అవి ఎటునుంచి ఏగంటలో బయలుదేరేది, చేరాల సినచోటుకు ఏగంటలో చేరుకుండేది నిర్ధారణచేశారు. నా విద్యార్థి కాలంలో ఈ పరిశోధనల ఘట్టాలను చదవటమంటే నాకు చెప్పరానంత వుత్సాహం వుబలాటం. ... ఇప్పుడు నా రాజకుమారుడు నా దగ్గర వుండటం, వాడి ధోరణిలో వాడు గుక్క తిప్పుకోకుండా చెబుతూవున్న కబుర్లను వింటూవుంటే అప్పుడు తెలుసుకున్న కథలూ గాథలూ నా బుర్రను వేడెక్కిస్తూ వుక్కిరి బిక్కిరిచేస్తూ వున్నాయి. ...

అబ్బాయి నా దగ్గరికివచ్చి మూడు రోజులయింది – ఈ లోకపు లెక్కపక్కల ప్రకారమే అని చెప్పటం అనవసరం కదూ.. ఈ రోజున నా రాజకుమారుడు నా ప్రక్కనే కూర్చున్నాడు. చేతిలో వాడికిచ్చిన మేకబొమ్మ. ప్రాణంవున్న మేక కన్నా రెట్టింపుగా దానిని బుజ్జగిస్తూ, దాంతో ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ, నేను వాడిదగ్గర వున్నాననే సంగతిని పూర్తిగా మరచిపోయాడు. అలా ఆనందిస్తూవున్న సమయంలో చప్పున ఏం తట్టిందో వాడి బుర్రలో! సంశయాశ్చర్యాలతో నాకేసిచూస్తూ,

"మేకలు పొదల్ని అమాంతంగా తినేస్తాయికదూ?" అబ్బాయి అన్నాడు.

"ఔను, అలా తినటం వాటికి పుట్టినప్పటినుంచే అలవాటయిపోయింది" అని వాడిని తృప్తిపరచటానికి జవాబిచ్చాను.

"నువ్వు అలా అనటం సంతోషంగా వుంది" ఏదో క్లిష్ట సమస్యను నా మూలాన తేల్చి వేసుకున్న ధోరణిలో సంతోషిస్తూ అన్నాడు.

II

ఇలాంటి ప్రశ్న అబ్బాయికెందుకు అంత ముఖ్యమైందో! మేకలకు దోవలో ఏది కనబడితే దాన్ని తినివేయటం పరిపాటి. మనలాంటి పెద్దవాళ్లకు అదంత ముఖ్యమైందికాదు. నా జవాబువింటూ అబ్బాయి తృప్తిపడ్డాడు. ఇంక ఆ సంగతే మరచిపోయి తన ఆటపాటల్లో మునిగిపోతాడని అనుకున్నాను. కాని వాడి బుర్ర పూరకుంటేగా! అబ్బాయికి నా జవాబు విన్నాక మరో కొత్త ఆలోచన తట్టింది. "అలాగయితే 'శోతి రొట్టె' చెట్లు వున్నాయిగా, వాటినికూడా మేకలు తింటాయా?" అనిరెప్పవాల్చకుండా మేకకేసి ఆత్రంతోచూస్తూ అడిగాడు.

'రొట్టె' చెట్లు ఆఫ్రికా అరణ్యాల్లో

ఇతర ఖండాల్లో అడపాదడపా పైకి వస్తూ వుంటాయని, అలా పైకివచ్చే "రొట్టె" చెట్లు ఆకాశానికే అంటుకుని పోతూ వుంటాయని, అలాటిచెట్లని కొబ్బరిచెట్లతో పోల్చవచ్చునని, వాటి కాయలు "రొట్టె" లకు మల్లె వుంటాయనీ, ఆదృశ్యాలను చూడటానికి అవకాశం కలిగిన యాత్రికులు వర్ణించటం పుస్తకాల్లో చదివాను. రాజకుమార్ "కోతి రొట్టె" చెట్లని అంటున్నాడు. అంటే ఈ "రొట్టె చెట్ల"ని గురించి వాడు వినేవుంటాడు. కళ్లార చూసే వుంటాడు. లేకపోతే అలా "కోతి రొట్టె" చెట్లని ఎందుకు నొక్కి చెప్పటం! ఒక కథను, గాథను అల్లుతున్నాడా? లేక అలాటివాటిని తను ప్రత్యక్షంగా చూసి వున్నాడా? వాడు వివరిస్తూ వున్న చెట్లు ఈ ప్రపంచంలోని "రొట్టె" చెట్లకన్నా ఎంతో పెద్దవై వుండాలి. మనుషులకన్నా ఏనుగలు పెద్దవి. అలాటి ఏనుగలు వాటి ముతాతో ఆపండ్లరుచి చూడటానికి వచ్చినా ఏంచేయజాలవు అనుకుంటూవున్నాను రాజకుమార్ చెప్పుతూ వున్నవాటిని వింటూ వూగొట్టుతూ. వాడు నా వూహాలను పసికట్టే వుండాలి. ఇతర గ్రహమండలాలనుంచి వచ్చేవాళ్లకు మన మనోభావాలు చప్పున అవగాహనం చేసుకుండే నేర్పుకూడా వుంటుంది కాబోలు.

కొంటెగా నాకేసి చూస్తూ ఒక చిరునవ్వునవ్వుతూ "ఒక దానిమీద ఒకదాన్ని ఎక్కిస్తేనో ..." అన్నాడు. దాంతో వూరకుండేగా! "అంత బ్రహ్మాండమైన చెట్లవడానికిముందే ... ఎంతో కాలం పట్టుతుందికూడా! మొక్కలగా వుండే కాలంలోకూడా ఎంతో బాగుంటాయి. ..." అంటూ ఏదో చెప్పబోతున్నాడు. నేనే మధ్యన అడ్డువచ్చి "అలాగైతే చిన్నప్పుడేవాటికి అలాటి లక్షణాలు వుండవచ్చు. అంటే నీ మేక అంత పెద్దవాటినికాకపోయినా, చిన్న చెట్లను తిని తృప్తిపడవచ్చుననేగా నువ్వు అనేది" అని అన్నాను.

నేను అన్న మాటకు తృప్తిపడే వుండాలి నా రాజకుమార్. ఫక్కున నవ్వాడు. "అలా తిని తృప్తిపడతాయో లేదో చూద్దాంకదూ" అంటూ తన కథాసాగరంలోకి ఆ పళాన మునిగిపోయాడు.

వాడు చెప్పినసంగతులను బట్టి నేను అప్పుడు అవగాహనం చేసుకున్నది ఇది-

"మన గ్రహమండలానికిమల్లె పరిశోధకులు మనకు తెలియజేస్తూవుంటూవున్న ఇతరగ్రహమండలాలకి మల్లె రాజకుమార్ వచ్చిన గ్రహమండలంలోకూడా ఇంతో అంతో చెట్లూ చేమలూ మొలకలెత్తటానికి అవకాశంవుంది. ఇలా మొలకలెత్తే వాటిలో మంచి జాతివి వున్నాయి. చెడ్డవి వున్నాయి. భూమిని చక్క- చేయటంలో, నాటాలసిన విత్తులవిషయంలో ఎంతో

శ్రద్ధ చూపాలి. అన్ని విత్తులు చూడటానికి ఒకేవిధంగా వున్నా, వాటిలోతూపాతులు తెలిసినవాళ్లకే ఏవివాటిలోమంచి విత్తులో చెడ్డ విత్తులో బాగా తెలుసు. పాదుల్లోనుంచి మొలకలుపైకి వచ్చాక, దినదినమూ కలుపును వెయ్యికళ్లతో చూస్తూ తీస్తూవుండాలి. అలా చెయ్యటంలో ఏరోజయినా అశ్రద్ధచేశామా ఇంకేంవుంది అసలు రూపానికే ప్రమాదం వస్తుందట.... రాజకుమార్ గ్రహమండలంలో ఇలాటి రొట్టె చెట్ల విత్తులు నాటటం పరిపాటట. వాటిరుచికి అలవాటుపడ్డ కలుపు మొక్కల జాతి ఒకటివుందట. రొట్టె చెట్ల విత్తులు వేయటానికి ముందు మంచి ఎరువులతో నేలను పదునుచేస్తారట. అలాటి చోట్లల్లోకే ఈ ప్రత్యేక కలుపు మొక్కల జాతి ప్రత్యక్షమవుతుందట. మొక్క పైకి వచ్చిందోలేదో దాని వేళ్లలోకి ఇవి అమాంతంగా చొచ్చుకుని ఇవి చేసే రభసఇంతింతని చెప్పాలా! ఇలాటి విషాదకరమైన సంఘటనలు అబ్బాయి లోకంలో జరుగుతుంటాయట. అబ్బాయి లోకం అసలే ఎంతో చిన్నది. ఒకసారి వాటి వేళ్లతో వాడి లోకాన్నంతా వ్యాపించి పోవుటయే కాకుండా, వాటికి అందుబాటులోనున్న ఇతర గ్రహమండలాలలోకి కూడా చొచ్చుకుని పోయాయట.

"ఇలాటివాటిని అరికట్టివేయటానికి మనమూ ఒక విధమైన శిక్షణకు అలవాటుపడివుండాలి. మనకాలోచిత కృత్యాలని ప్రతిరోజూ మనం తూ. చా. తప్పకుండా నెరవేర్చుకుంటూ వున్నమాదిరే, ఆ చెట్ల కాలోచిత కృత్యాల భారాన్నికూడా మనమీదే వేసుకుంటూ వుండాలి. అలా చేయటం సులభమైనపనికాదు. అయితేనేం తప్పనిసరిగా ఆ పనిని చూచుకోటం మన విధి. విధ్యుక్తధర్మం" అని తనది ఈ సంగతుల్లో సిద్ధహస్తమని తెలిపే ధోరణిలో అనేశాడు.

తను చెప్పే కథను పూర్తి చేశాడో లేదో, అబ్బాయి నాకేసిచూస్తూ అపురూపం లేని వుద్వేగంలో "ఇలాటి కోతి రొట్టె" చెట్టునొకదానిని ఎంతో శ్రద్ధతో ఇప్పుడే గీయటం బాగుంటుంది" అన్నాడు. ఎందుకలా అడగటం అనుకుంటూ ఒకసారి అబ్బాయికేసి చూశాను ఆశ్చర్యంతో. ఎందుకలా నేను ప్రశ్నించానో వాడు చప్పున పసికట్టాడు. కొండెచూపులతో నాకేసి దృష్టి నిగిడిస్తూ "మీ ఇంట్లో చిన్నా పెద్దా వుంటారుకదూ. వాళ్లే ఇతర లోకాల్లో సంచారం చేయటానికి అవకాశం కలిగితే ఇలాటి చెట్లను చూడటానికి వీలుంటుంది. నువ్వు ఇలాటి చెట్ల బొమ్మలని యథాతథంగాగీసి నీ దగ్గరవుంచుకుంటే వాళ్లని కలుసుకున్నప్పుడు వాళ్లకి

(498-పేజి చూడుడు)




(గత సంచిక తరువాయి)

అయినా! తోట మాలికది
తాత్కాలిక ఆవేదనలో ఆ క్రోశం.
ఏదయినా! కొంతసేపు అంతే!
తరువాతది శుభప్రవేశం
"బ్రతుకు ఒకప్పుడు మోజాగా వుండేది —
ప్రతిరోజూ వొకప్పుడు తాజాగాయిలా
మారుతూండేది" —
ఇది తోటమాలి పూబాటల్లో
పచార్లు చేస్తున్నప్పుడు కల్గే తీయని ఆలోచన
అది అతని అంతరాత్మకు సంతృప్తి
కల్గించేధ్యేయిని మధు రాధర చుంబన
ఇటువంటివి అతనిలో అంతులేదు
బాటమీద నడకలో చింతాక్రాంతి లేదు.
ముళ్ళకంప మధ్యలో — ఇంతలో —
ముచ్చటగా నవ్వింది ఒక అనామకసుమం
కళ్ళు కాస్త పెద్దవిగా చేసి
గవేషించాడు ప్రప్రథమం . .
'తాతా' - అని పిల్చింది మనుమరాలై
రెండోసారి
"తాతనా!" అని తడుముకున్నాడు
ముడుతలుపడిన చర్మాన్ని మరొక్కసారి
"మర్చిపోయావా?"
"గుర్తులేనూ!" — అని ప్రశ్నించింది కుసుమం
తరిచి — తరిచి జ్ఞప్తికి
తెచ్చుకున్నాడు ఒక్కనిముషం
నిద్ర లేచి నట్లయింది మాలికి
భద్రకాళికి బలిచ్చిన పసిపాప
పలుకు నెత్తురు తడికి -,
ఆనాడు — . . గత సంస్మృతిలో —
తాను మానవుడు - తపస్వి
కళాత్మకమైన సృష్టి రచన కోసం
కాళీమాతను సాక్షాత్కరింప చేసుకున్నాను
"మాయ యెరుగని వొక అమాయకు
రాలిని" బలిగా కోరింది ఆ నాటి రాత్రే
నాదుహిత ప్రసవించి - కళ్లు తెరువని పసికూనని
దేవికోసం బలియివ్వమంది —
క్రియ పూర్తయింది
రుద్రకాళి కోరుకొమ్మనింది వరం
"క్షుద్ర జీవాల్లో సృష్టించకూ దేవీ!
ఆ ఘోరం నేను భరాయించలేనూ!
మలిన మవకుండా మనగల్గే
జాలిజీవితాన్ని ప్రసాదించుదయగల్గే!"
అని కోరిన వరప్రసాదమే నా, నా
యీ మనుమరాలు -,
తను వెల్లలిచ్చి పిలిపించుకొంటున్నది
యీ అనామకురాలు -,
"బాగున్నావా"! అన్న ప్రసూన
ప్రశ్నకు సరిగా —,
"సాగిపోతోంది బ్రతుకు" అన్నాడు సమాధానంగా
అక్కడ యెవ్వరూ యీ మాట
వినటంలేదూ! - లేదు
ఎక్కడా తుమ్మెద గాదు
ఎగరడం లేదు —
చేతి కర్ర మోపు జేసి

నడుంవంచి, తలనిమురుతూ -,
"ఎలా వుందిక్కడ ?" అన్నాడు.
"కోతి మూక వచ్చి నన్ను
గిలిగింతలు పెట్టకుండా
ముళ్ళముసలి కాస్తోందిక్కడ"-
"స్వేచ్ఛగా వుందే !"–
"ఉచ్ఛ్వాసనిశ్వాస క్రియ సాగుతూనేవుందే"–
"కృత్రిమ సౌందర్యాలకు కుతూహల
పడబోకుసుమా !
ధాత్రి కడుపులో జరిగే దారుణ
హింసా కాండల్లోకి జొరబడబోకుసుమా !
అనామకుల జీవితమే
హాయిగావుంటుంది
ధనాధిపతుల బ్రతుకే
దిన దినాభివృద్ధియై మారుతూవుంటుంది.
వలిగాలి తెరలలో -
వలపు వీచికలు చూపకుమా !
తెలినవ్వు మొలకలో
తేలి రాబోకుమా !
ఈ తోట శృంగార వాటిక
నీ బోటి వారలకు చోటులేదిక
వయసులో వార కాంతల కృత్యాలకు
ప్రియములో కుసుమ కోమలి పల్కు సత్యాలకు
తారతమ్యాలు "నభూతో నభవిష్యతి"
తీరు తెన్నులు దాదాపుగా జనశ్రుతి" –
తాత సందేశంలో దాచి చెప్పింది లేదు
నీతి నియమాలున్న మనసుకి
నిలువునా యెక్కుతుంది. తప్పదు.
"నేను పరుల కంట బడకుండా
మసలుకోవాలా ?"
తనకు తాను ప్రశ్నించుకొంది.
మనసుని తడిమి చూసుకొంది
"నేను ప్రకృతిని చూస్తే తప్పేమిటి ?"
కనులు అందాన్ని వెతుక్కుంటాయటేమిటి ?
కట్టు దిట్టంగా ముళ్ళముసలి కప్పివేస్తోంది నన్ను -,
చుట్టు ముట్టడానికి చులకనగా లేదనిపిస్తోంది తెన్ను
కనులలో మన్మథావస్థలు లేవా ?
మనసులో కామప్రేరేపణలు జరుగవా ?"
గంధవాహుడు సుగంధ
సురటేసురట స్వరసమ్మేళనా
మాధుర్యాన్ని చవిమాపకుండా
పోతాడా !

అంధకార బంధురమై
విరిబోణుల విరహోత్కర
విలాపాలాపన రెచ్చగొట్టి
రజనీకాంతుడు కనుమరుగై
పోతాడా !

వయసు వసంతఋతువై,—
వలపు తలపు పీవనవై
ప్రణయానికి - వినయంగా
వస్తే-,

ప్రేయసినై - ధ్యేయుడికై,
ప్రేమోన్మాదపు మధుర సంగీత
స్వరూపిణినై - చరిస్తే-,

తాత మనస్సు చివుక్కుమంటుంది
ఘాతుకచర్యల పాలై నానని కంఠం
గావురు మంటుంది.

"తాత" – శబ్దానికి ధన్యత
కూర్చేది నువ్వే.
ఖ్యాతి సంపాదించి పెట్టినా
నువ్వే.

పెంటదిబ్బమీద పడుకున్న
పుష్పాలకు పూర్వజన్మవాసనలేదు.
మింటివంకచూసి, జంటకోసం
తంటాలుపడే కుసుమాలకు, నా
హితబోధ అర్థంగాదు"–,

ప్రాదుర్భావం పెచ్చరిల్లుతున్న
ఉచ్ఛదశలో అనామకసుమానికి
ఇలా ఆకళింపుకొచ్చాయి ఆ నాటి
తాత సూక్తులు.

ఏదుర్భావమూ తనలో వుండకూడదనే
వశీకరణ చేసుకున్నాడన్నీ శక్తులు.
సాలెగూడు సదనంలో_
ముళ్ళముసలి కౌగిలిలో_
మదనరూప రాగాన్నే_,
మర్చిపోయి వుండాలా?
గాలివాడు — తేలియాడి — సోలి
పోదమంటె నేను, కలియుగమ్ము
ప్రళయములో కలియువరకు
వుండాలా_?

అనామకసుమంలో వేదనలా వేదనలు
నాటినాటికి విభిన్నరూపాల్లో
వికార స్వరూపాల్లో విజృంభించుతున్నయి.

ప్రణామభంగిమలో — ప్రకృతంతా
ప్రభంజనంలో ప్రతి ధ్వనించి — పృథివిపై
అధోగతి పాలవ్వడానికి పరమేశ్వరుని
ప్రళయశక్తులు పరుగెత్తుకొస్తున్నయి.
"ఏపతివ్రత దీక్షామహాత్యమో
విలయం విరుస్తోంది" — అనుకున్నాయి,
త్రిభువనాలు.
ఏగతి జగత్సర్వం ముందు ముందు.
విజ్ఞానయుతంగా విలసిల్లుతుందో_"
అనుకున్నాయి భువనాలు.

విరూపాక్షుని వింత నేత్రం,
విస్ఫులింగాల్ని వెదజల్లింది.
స్వరూపాన్ని — కురూపంగా
మార్చివేసిందని ప్రకృతి సుందరి
వికృతంగా రోదించింది.
విశ్వకల్యాణ నిమిత్తంగా_
విద్రోహక చర్యల్ని_,
వినాశపరుల్ని_,
విద్వేషణాధారుల్ని_,
ఉద్వేగంగా_,
ఉద్రేకంగా_,
ఉవ్వెత్తుగా_
ఉరకల - కెరటాలతో - లేస్తూ,
వచ్చి, విశాల హృదయంలో
దాచుకున్నాడు సాగరుడు.
విశ్వాసరాహిత్య భావబంధురమైన
పుష్పాల్ని తన హస్తాలతో - తీసికొచ్చి
పరమేశ్వరార్పితం సేయకుండా
అఖాతంలోకి త్రొక్కి_వుంచాడు
సముద్రుడు_,
కదలిరాయుని కెరటాలవంక
పదేపదే దృష్టి సారించాడు హరుడు_,
విడిలిపోక — తడిసిపోక — జడిసిపోక
విప్పారిన సౌమ్యముతో,
విరబూసిన నగుమోముతో_,
విరూపాక్షుని పాదాంతికమునవచ్చి,
శిరస్సు వంచింది.
తాత మనుమరాల్ని అందుకని,
"ప్రీతిగా బ్రతికి — ఖ్యాతి నార్జించుకొని,
పతిగా పరమేశ్వరుడే తగునని
పతిగా వచ్చిన నా మనుమరాల్ని స్వామీ!
స్వీకరించవూ!" — అని కృతజ్ఞతతో
కరకమలాల యందుంచాడు.
హరుడు అందుకొని తనలో
ఐక్యంచేసుకున్నాడు.
మరుడు అనామక కుసుమకుమారి
మనస్థైర్యానికి అచ్చెరువడి
నాలిక్కొరుకున్నాడు.
"స్త్రీలలో నేగాదు,
పాతివ్రత్య మహిమవుంది.
పూలలో గూడా
పొదగబడివుంది.
స్త్రీలు — పూలే,
పూలు — స్త్రీలే,
సృష్టి తారతమ్యాలులేవు,
దృష్టిలో న్యాయమార్గాలు కలవు.
తాత ప్రవచించిన యీ కథా కథనంకి
సరస్వతి గంటం సంగీత స్వరాల్ని కల్పించింది.
'తాత' — విధాతగా మారాడు,
అతని సృష్టి వైచిత్ర సకల లోకాలకు
ప్రమోదాన్ని గూర్చింది.

# బ్రహ్మబంధాలు

శ్రీమతి చిల్లా కమలాదేవి

—— (౧) ——

జ్యేష్ఠమాసం. పెళ్లి ముహూర్తాలు ఆ సంవత్సరం ఎక్కువనే చెప్పాలి. ఎండలు భగభగమండే రోజులు. నీళ్ల యెద్దడి. జంతువులు సయితం నీళ్ళకోసం నోరు తెరచే కాలం. ఆ మాసంలో యిక పెండ్లిళ్లు ఎలా జరుగుతాయో వేరే చెప్ప నవసరములేదు.

అప్పుడు నేను ఇంటరు చదువుతున్నాను. మొదటి సంవత్సరం అయింది. రెండో సంవత్సరంలో అడుగుపెట్టటానికి యింక మూడు నెలలుంది. నాకు ఏమి చేయటానికి తోచలేదు. ఉన్నట్టుండి ఒక ఎడ్వర్టైజుమెంటు నా కళ్ళముందు పడ్డది. అప్లికేషన్ వ్రాసిపంపాను. అనుకోకుండా అపాయింటు ఆర్డరొచ్చింది. ఏమిటి బస్సుల చెకింగ్ యినస్పెక్టరు. మా వారంతా ఎగతాళిచేశారు. ఏమైనాకాని అని అపాయింటు అయ్యాను.

బద్ధకం అంటె ఎరుగని సమయం. శ్రమ అనుకోకుండా రోజుకు కనీసం అయిదు లేక ఆరు రూట్స్ల్లోయుండే బస్సులన్నిటిని చెక్ చేసేవాడిని. ఏమాత్రం తప్పు కనిపించినా వెంటనే కండక్టరు లైసన్సో, లేకపోతే, డ్రైవర్ లైసన్సో, లేకపోతే బస్ రూటో కాన్సిల్ చేసేవాడిని. తరువాత నేను ఆఫీసుకుపోగానే "సార్! బిడ్డలుగలవాళ్ళంసార్! ఈ ఉద్యోగం పోతే మాకు అన్నమే కరువౌతుంది. మా నోటి దగ్గర అన్నం తీసివేసిన వాళ్లవుతారు సార్!" అని ఏకరువుపెట్టేసేవాళ్లు. అంతావిని వాళ్ళుచేసినపని తప్పు అని వాళ్ళ నోటిగుండా చెప్పించి లైసన్సు యిచ్చి పంపించేవాడిని. అవును – దరిద్రుడికి పిల్లలు ఎక్కువమంది ఉంటారు. వీళ్ళ తప్పేమి ఉండదు. బస్సు ఓనర్సు వీలైనపుడు ఓవర్ లోడ్ చేయమని ఆజ్ఞాపిస్తారు. సమయమొచ్చినపుడు చేయక పోతే ఉద్యోగం ఖాళీచేస్తే, పట్టుపడితే వీళ్లు క్షమాపణలు చెప్పుకోవాలి! అందుకు వీళ్లకు చిల్లిగవ్వైనా ఆదాయం యుండదు. వీళ్ళని బాధించటం దేనికని నేను ఎక్కువగా పట్టించుకొనేవాడినిగాదు.

నాలో నాకు నవ్వొచ్చేది. నా వేషం నాకు వింతనిపించేది. మామూలుగా చెక్ చేయటమంటె సరదాగానే యుంటుంది. పైన కోటు, హాటు పెట్టుకోవాలి. అందులో ఎండాకాలం, కోటు తొడుక్కుంటె లోపల జీవుడు తుకతుక ఉడికిపోయేవాడు. అందుకని కోటును తీసేసి హాటు మాత్రం పెట్టుకోటం మొదలు

పెట్టాను. అదీ ఒక సరదా అనిపించేది. ఉన్నట్టుండి మా ఊరువాళ్ళు ఎవరైనా బస్సుల్లో కనబడి 'ఏరోయి!' అన్నారంటె ప్రాణం నిలువునాపోయేది. అందుకని సాధ్యమైనంతవరకు తప్పించుకొనేవాడిని.

ఇట్లా ఉద్యోగం చేస్తుండగా నా జీవితంలో మరవురాని సంఘటనొకటి జరిగింది. అది పెళ్ళిళ్ళ సీజను కాబట్టి పెళ్లివారు బస్సులు కంట్రాక్టును తీసుకొని అందులో పోయేవారు. ఆ బస్సుల్లో మనుషులు కిక్కిరిసి యుండేవారు. అటువంటి బస్సులు పట్టుకోవాలంటె నా కెంతో సరదాగా యుండేది కుఱ్ఱతనం గనుక.

ఒక రోజున విధివిరామం లేకుండా బస్సు తరువాత బస్సు అన్నిటిని వేటాడటం మొదలు పెట్టాను. అనుకోకుండా పెళ్లివారి బస్సొకటి ఎదురుపడ్డది. ఈ ఉద్యోగంలో చేరగానే బస్సులవాళ్లువేసే ఎత్తులకు పైఎత్తులు వేయటం అలవాటై పోయింది. అందుకని దగ్గరికి వచ్చిందాకా మామూలు ప్యాసింజర్ లాగాయుండి దగ్గరికి రాగానే హాటుపెట్టుకొని ముందుకు వచ్చాను. నన్ను చూడగానే డ్రైవరు వణుకుతూ సడన్ బ్రేకువేశాడు. ఫుట్ బోర్డుమీదకుఎక్కి లోపలకు చూశాను. బస్సులోయుండే వాళ్లంతా వింత మృగాన్ని చూసినట్లు నన్ను చూడసాగారు. నాకు నవ్వొచ్చింది. నా ముఖంలో ఏముందా! అనిపించింది. అనుకోకుండా నా దృష్టి నూతన దంపతులపై బడ్డది. నాకు సిగ్గేసింది. చుట్టూరా కలయచూశాను. నాకు ఎక్కడలేని ఆశ్చర్యమేసింది. మా మేనమామ ముందు సీటులో కూర్చొని నా వంక చూస్తున్నాడు. నాకు భయమేసింది. నన్ను గుర్తుపట్టి 'ఏంరోయి!' అని నా పరువు తీసేస్తాడనిపించింది. ఒక్కసారి క్రిందికి దిగాను. డ్రైవరు, బస్సు ఓనరు నా దగ్గరికివచ్చి బ్రతిమలాడటం మొదలుపెట్టారు. వెనుకనుంచి మా మామగారువచ్చి యిదిగోనండి! తీసుకొండి అని ఐదు పదిరూపాయల నోట్లు బయటకు దీశాడు. నాకు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వొచ్చింది. కాని పెదిమల సందునే బిగించాను. డ్రైవరు, ఓనరు వైపు తిరిగి చెడబడా నాలుగుమాటలని, వాళ్లను అవతలకు పంపాను. మా మామగారు నోట్లు చేతిలోపట్టుకొని నా ముందు నుంచొని దీనంగా చూడసాగాడు. హాటు తీసేశాను. ఒక్క నిమిషం నా వంక పరీక్షగాచూసి "ఏంరోయి ఈ ఉద్యోగం ఎప్పుడు మొదలుపెట్టా!" అని నవ్వసాగాడు. మేమిద్దరం నవ్వటంచూచి బస్సులో ఉన్నవాళ్లంతా బస్సుదిగి మా వంక వింతగా చూడటం మొదలు పెట్టారు.

నాకు యిక ఏమిచేయాలో తోచలేదు.

అందరూ "వీడేనా! ఉద్యోగం ఎప్పటి నుంచి చేస్తున్నాడు." అని ప్రశ్నలు మొదలు పెట్టారు. నాకు వారి ప్రశ్నలు వింటుంటే ఒక్క అరగంటసేపు నవ్వాలని పించింది.

మామయ్య నా వంక తిరిగి "పెళ్లికి రాకుండా యిదేనా చేసే ఘనకార్యం!" అన్నాడు నవ్వుతూ.

"మీరు యిలా వస్తారని తెలియదు మామయ్యా! కాని నిన్ను పట్టుకుంటె ఏమివస్తుంది గనుక!" అన్నాను నవ్వుతూ.

"బాగానేఉంది లేవోయి! యివాళ రాత్రికయినా అందుకుంటావా లేదా! మీ యింట్లో ఎవరూ రాకుండా ఎగనాం పెట్టారుగదా! కనుక నీవైనా రావా" అన్నాడు.

ఆ మాట వినిపించుకోకుండా ప్రక్కకు తిరిగాను బెట్టు సరి చేయాలని.

ప్రక్కనుంచి బస్సు ఓనరు నవ్వుతూ వచ్చి "రండి సార్! బస్సులో వెళదాం!" అన్నాడు.

"బాగుంది! నేనువస్తే నీబస్సు ఎవరూ పట్టుకోరనా?" అన్నాను.

ఎదురుగా యింకో బస్సు వస్తుంది. అంతా చేరి రమ్మని బలవంతంచేయటం మొదలెట్టారు. నాకు వాళ్లతో పోవటం యిష్టమేగాని, ఉద్యోగాన్ని ఎక్కడ విసిరి పారేద్దామా! అనిపించింది. ఇక చేసేది లేక రాత్రికి గృహప్రవేశానికి వస్తానని మాట ఇచ్చారు. బస్సువచ్చి నా ముందు ఆగింది. డ్రైవరూ, కండక్టరూ వణుకుతూవచ్చి నా ముందు నుంచున్నారు. అక్కడనుంచివచ్చి బస్సు ఎక్కి కూర్చున్నాను. మా మామయ్యను పిలచి ఒక అరగంట ఆలస్యంగా వస్తానని రహస్యంగా చెప్పి ఆఫీసుకు చేరాను.

2

నిజానికి మా మేనమామగారికి, మాకు ఎందుకో రాకపోకలు లేవు. ఎప్పుడయినా కనబడితే మామయ్యకనబడతాను. అందుకని వారి కుటుంబంలో మామయ్య తప్ప నాకు యింకెవరూ తెలియదు. మామయ్యకు ఒకకొడుకు, నలుగురు ఆడపిల్లలు. ఆడపిల్లలకు ముగ్గురికి పెండ్లిచేశాడు. యిప్పుడు చేసేదే పెద్ద కొడుకు పెళ్లి.

అటువంటి క్రొత్త ప్రదేశానికి పోకుండా తప్పించుకుందామని విశ్వప్రయత్నం చేశాను. కాని అనుకోకుండా ఈ సంఘటన జరుగటంతో పోకతప్పలేదు. ఆఫీసులో మంచి బట్టలు వేసుకొని టింగు రంగాగా బయలు దేరాను. బయటకు రాగానే ఒక టాక్సీ కంట బడ్డది. డ్రైవరు ఎరుగున్న వాడే. రాండి సార్! అని ఆహ్వానించాడు.

వాడి ఆహ్వానాన్ని త్రోసెయ్యలేక మామయ్య ఉండే ఊరు చెప్పి టాక్సీలో కూర్చున్నాను.

టాక్సీ ఆగటం చూచి అందరు బయటకువచ్చారు. అల్లుని దర్పం అంటె ఎరుగని వాళ్లం. అందులో యిటువంటి చోటుకు రావటమంటె తగని సిగ్గు. చిన్నగా లోపలకు అడుగు పెట్టాను. నాలో విద్యుత్తు ఒక్కసారి ప్రవహించినట్లైంది. చుట్టూరా చూశాను. పెళ్లివారు ముస్తాబై సరదాగా కూర్చున్నారు. పెట్రమాక్సు లైట్లు జోరుగా వెలుగుతున్నవి. సన్నాయి పాట కచ్చేరి జరుగుతుంది. గుండె వేగంగా కొట్టుకుంటున్నది. వెనుకకు తిరిగి పోదామా. అనిపించింది.

"రారా! యింత ఆలెస్యంగా నా వొచ్చేది!" అని వెనుకనుంచి మామయ్య అన్నాడు.

"కాళ్లుకడుక్కో-నాయానా!" అని ఎవరో ఒకామె నీళ్లు తెచ్చిపెట్టింది. మా అత్తయ్యని ఊహించుకున్నాను. కళ్లకున్న కూలింగ్‌గ్లాసులుతీసి కాళ్లుకడుక్కున్నాను.

గుడ్ నైట్! అంటూ పెళ్లికొడుకు మేజువాణి దగ్గరినుంచి పేకు హాండిచ్చాడు.

"సార్! నేను వెళతాను" అని నాబ్యాగ్ తెచ్చి డ్రైవరిచ్చాడు. వీటితో నాకు ఉక్కిరి బిక్కిరి అయిపోతుంది. డ్రైవరు చేతిలో బ్యాగ్ తీసుకొని ప్రెజెంటేషనుకు తెచ్చిన రింగ్సును తీసి పెళ్లికొడుక్కు ప్రెజెంటుచేశాను. తరువాత పెళ్లికూతురుకి ఏలాయివ్వాలో నాకు తోచలేదు. రాండి అని పెళ్ళికుమార్తె దగ్గరికి తీసుకెళ్లారు. ఆమెకిచ్చి నేను తప్పుకున్నాను. తరువాత నేను ఎరుగని బంధువులు కొందరు వచ్చి కుశల ప్రశ్నలు వేయటం మొదలు పెట్టారు.

తరువాత కొద్ది సేపటికి అంతా భోజనాలకు లేవమని ఎవరో పెళ్లి పెద్ద ఆహ్వానించారు. నేను తిన్నగా పాంటు షర్టు విప్పి లుంగి ధరించాను. నేను సిద్ధమై అందరితోటి భోజనాలకు కూర్చున్నాను. నాకు అందరితోటి భోజనం చెయ్యటమంటె బలేసరదా. కూర్చున్నవారంతా ఏదోసందడిగా మాట్లాడుతుంటె మరీ సరదా. నాకు అక్కడున్నవారంతా క్రొత్త. వారి మాటలు వింటుంటె ఎంతో ఉత్సాహంగా ఉంది. నేను వారి మాటలు వింటూ పెట్రమాక్సు లైటువంక చూస్తూ కూర్చున్నాను. అనుకోకుండా యిక్కడకు రావటంతోటి, సరదా చలోక్తులు వినటంతోటి నా మనస్సులో తీయని ఆలోచనలు ఒక్కొక్కటిగా వస్తున్నవి. అలాగే చూస్తూ కూర్చున్నాను. ఎందుకో నా ఆలోచనలు చెదరి చూపు లైటు ప్రక్కకు

తిరిగింది. లైటు అవతలవైపున ఆడవారి బంతులని అపుడు తెలిసింది. నాదృష్టి ఒకామెపైపడ్డది. ఆమె నా వైపు ఆమె ప్రక్కనున్న ఒక యువతివైపు చూస్తుంది. ఆమె వైపునుంచి ప్రక్కనున్న యువతిని చూశాను. ఆ యువతి నావంక తదేకంగా చూస్తుంది. నాకు ఎందుకో భయమేసింది, ఆమె నా వంక ఆ అమ్మాయివంక చూడటం ఏమిటి? అనే ఒక వెఱ్ఱి ఆలోచన బయలు దేరింది. యింకోసారి ఆ అమ్మాయిని చూడాలనిపించింది. ఎందుకైనా మంచిదని ఒకతనితో సంభాషణ ప్రారంభించాను. భోజనాలు ముగిసినై.

, మా అత్తగారు నా దగ్గరికివచ్చి "ఏం! నాయనా! నిన్ను యిదే మొదటిసారి చూడటం! మీ మామయ్య నీగురించి చెబుతుండేవాడు! అని" అన్నది.

నాకు ఏమి మాట్లాడాలో తోచలేదు. అత్తయ్య ప్రక్కనున్న అమ్మాయిని చూశాను. పదునాలుగు సంవత్సరాలుంటవి. పచ్చని పసిమి. గుండ్రటిముఖం. విశాలమైన మల్లెపూవులాంటి కళ్ళు. ముఖంలో ఎంతో ఆకర్షణీయత ఉంది. సిల్కుపరికిణీ నీలంరంగు జాకెట్, వాయిల్ వోణి వేసుకుంది. ఆ అమ్మాయి, భోజనాల ముందు నేను చూచిన అమ్మాయి ఒకడే! ఆ అమ్మాయి పోలికలు, అత్తయ్య పోలికలు ఒకటి! మామయ్య కూతురు కాబోలు! అనుకున్నాను. ప్రక్కనుంచి మా బావగారు అంటు పెళ్ళికొడుకువచ్చి "రాండి! లోపలికి పోదాం"అని వచ్చాడు.

"ఇప్పుడప్పుడే మీ బావను వదలతామా!" అని నవ్వుతూ అత్తయ్య అన్నది.

నవ్వుతూ మా బావగారి రూములోకి పోయాను. మా బావ వాళ్ళ ప్రెండ్సు అందరితోటి పరిచయము చేశాడు. వారందరితోటి ఎక్కువ చనువుగా మాట్లాడి స్నేహాన్ని సంపాయించాను. కాని నా మనస్సంతా భోజనాలముందు జరిగిన సంఘటనమీద నేయుంది. ఎక్కడ చెడ్డ పేరు వస్తుందో అని నాకు భయమేసింది. ఈ విషయం జ్ఞాపక మొచ్చినప్పుడల్లా వొంటిమీద రోమాలు ఒక్కసారి బిగుసుకుంటున్నవి.

♦ ♦ ♦

తెల్లవారింది. నేను డ్యూటిలోకి పోవటానికి అత్తయ్యకు మామయ్యకు చెప్పిపోదామని బయలుదేరాను. కాని ససేమిరా కదలటానికి వీలులేదని నా బ్యాగ్ తీసుకొని లోపల పెట్టారు.

యింక చేసేది లేక అక్కడే ఉండిపోవలసివచ్చింది. ఎన్నోసార్లు మా అత్తయ్యకూతురు కంటబడ్డది. కాని సాధ్యమైనంతవరకు తప్పించుకొనేవాడిని. ఆ

పగలల్లా అందరితోటి కబుర్లతో గడిపాను.

రాత్రికి మేజువాణి జోరుగా జరుగుతుంది. పెళ్ళికొడుకు తరపు కొందరు, పెళ్ళికూతురు వైపుకొందరు ఆడవాళ్ళుచేరి మీరు ముందంటె మీరు ముందని పేరు చెప్పమనటంలో గోల చేస్తున్నారు. అందరితోటి ఆ గోలచూస్తూనుంచున్నాను. మా మామకూతురు నావంక నిమిష నిమిషానికి నావంక చూడటం కని బెట్టాను. అక్కడ ఉండగూడదని మేడమీదకు పోయి చంద్రుణ్ణి చూస్తూ నుంచున్నాను. మా అత్తయ్య యింకా కొందరు ఏదో వెతుకుతూ పైకి వచ్చి వెళ్ళిపోయారు. వారి వెంట మా బావ బావ చెల్లెలు ఉండటం చూశాను. ఒక్క నిమిషం ఆలాగే నుంచున్నాను. వెనుకకు చూచుకుంటూ ఆ అమ్మాయి పైకి వచ్చింది. ఒక్కసారి ప్రక్కకి పోయి క్రిందకి చూశాను. ఎవరి పనులలో వారున్నారు. చిన్నగా నా దగ్గరికి వచ్చింది.

"ఏం! కావాలి!" అన్నాను.

తలవొంచుకొంది.

నాకు ఏమి మాట్లాడాలో తోచలేదు. ఒక్కసారి చెయ్యిపట్టుకొన్నాను.

"నిన్నుతప్ప యింకెవరిని పెళ్ళి చేసుకోను" అని చెప్పింది.

"మంచిదే! మీ నాన్నను ఒప్పించు" అన్నాను.

అర్థంచేసుకున్నట్లు ఒకనవ్వు నవ్వి చెంగున క్రిందికి దిగిపోయింది.

◆ ◆ ◆

అంతే మళ్ళా వచ్చిన జ్యేష్ఠమాసానికి మాకు పెళ్ళి అయింది. నేను అప్పుడను కున్నాను "బ్రహ్మవేసే బంధాలు ఎవరికి తెలియవుగదా!" అని.

"ఎందుకంటె ఆ అమ్మాయిని యింకొ అతనికి యివ్వాలని బంధువులు పలుసార్లు అంటుంటె నా చెవులతోటి ఎన్నోసార్లు విన్నాను. అటువంటి సమయాన నేను కోరితే ఏట్లాయుంటుంది! నేను చే దొరకదన్న సంబంధం జిక్కిందంటె నిజంగా బ్రహ్మ భంధాలు ఎవరికి తెలియవుగదా!" అనుకున్నాను.



# ఆదర్శం - ఆచరణ

శ్రీమతి డీ. వాణి



ఆ యేడు దసరా సెలవులకు మైసూరు వెళ్ళాను. అక్కడే నా స్నేహితుడు ప్రభాకర్ లెక్చెరరుగా పనిచేస్తున్నాడు. నా రాక కెంతో ఆనందించిన ప్రభాకర్ దంపతులు చాల మర్యాద చేశారు. నేను మాత్రం అతని భార్య రాధను చూచి ఆశ్చర్యపడ్డాను. తెల్లగా అందంగా ఉండే ప్రభాకర్ నల్లగా ఉండే రాధ నెట్లా చేసుకున్నాడో ననిపించింది. ప్రభాకర్ పెళ్ళి అయిన క్రొత్తలో నలుగురూ విడ్డూరంగా అనుకున్న మాటలు నన్ను అసలు విషయం తెల్సుకో మని పురిగొల్పాయి.

"సాయంత్రం కాఫీ త్రాగుతూ ఉండగా "రాధ నీక్లాసు మేటా ప్రభాకర్?" అని అడిగాను. ప్రభాకర్ నా భావం అర్థమైనట్లుగా నవ్వాడు.

"నీవడగబోయే ప్రశ్న, నీ ఆశ్చర్యానికి కారణం నాకు తెలుసు శంకర్! రాధ నా క్లాసుమేటు కాదు. ఆదర్శం ఆచరణలో పెట్టబడిందని మాత్రమే సమాధానం యివ్వగలను;" అన్నాడు.

మరునాటి సాయంత్రం యిద్దరం షికారుకి బయలు దేరాం.

"నీకు వివాహవిషయం తెలుసుకోవాలని కుతూహలంగా ఉందికదూ!" అని నవ్వి జరిగిన సంగతులు చెప్పసాగాడు.

♦ ♦ ♦

ప్రభాకర్ ఎమ్. ఏ ఫస్టుక్లాసులో ప్యాసై, లెక్చెరరు అయిన రోజులవి. మంచి కుటుంబానికి చెందినవాడూ, చదువుకున్న వాడూ అయినందువల్ల చాల సంబంధాలు రాసాగాయి.

వకీలు పరంధామయ్య ఆ కుటుంబానికి బాగా పరిచితుడు. అతని స్నేహితుడు శ్రీరాం కూతురు రాధ. శ్రీరాం మధ్యతరగతి సంసారి. ఇద్దరు కూతుళ్ళకు శ్రమపడి పెళ్ళిళ్లు చేశాడు. ఆఖరి కూతురు రాధ. ఆమె యింటరు ప్యాసై ఆర్థికపరిస్థితులు బాగు లేక కాలేజీ మానేసింది. వీణ చక్కగా వాయించడమే కాక మధురంగా పాడుతుంది. కాస్త నల్లగా ఉన్నా కళలుచిందే ముఖంతో చక్కగా ఉంటుంది. గుణవంతురాలు. అటువంటి రాధను చూడవలసిందని పరంధామయ్య ప్రభాకర్‌ను కోరాడు.

మంచి ముహూర్తం చూసుకొని ప్రభాకర్, తండ్రి వెళ్ళారు. శ్రీరాం బాగా మర్యాదచేశాడు. రాధను తీసుకొచ్చారు. వీణ వాయించింది. పూర్యాకళ్యాణి రాగపు కృతి "పరమపావన రామా" మధురంగా పాడింది. ఆమె కంఠ మాధుర్యం ప్రభాకర్ నేవో లోకాలకు తీసుకుపోయింది. కొంతసేపటికి వెళ్ళి పోయారు.

♦ ♦ ♦

'అమ్మాయి నల్లగా ఉంది. అదీకాక వాళ్లు మన హోదాకి తగరు;' తండ్రి తేలిగ్గా తేల్చేశాడు.

'అయితే లాభంలేదు. పరంధామయ్య మాటలు నమ్మి వారింటికి వెళ్ళడం మర్యాదకి భంగం' అని తల్లి యీసడించింది. వారిమాటలు విన్నాక ప్రభాకర్ మనస్సుకూడ ఒకవిధంగా మారిపోయింది. తను అందగాడు, మంచి చదువు చదివి హోదాలో ఉన్నవాడు కాబట్టి గొప్పయింటి సంబంధమే చేసుకోవాలనిపించింది. పూర్వపు మంచి తనపు ఉత్తమాదర్శాల స్థానాన్ని గర్వం ఆక్రమించుకుంది.

ప్రభాకర్ నించి యే సమాధానమూ రాకపోయే సరికి శ్రీరాం నిరాశ చెందాడు.

పరంధామయ్య అసలు విషయం కనుక్కుందామని వెళ్ళాడు.

'అమ్మాయి బాగుండదు. అందుచేత ప్రభాకర్

ఇష్టపడ లేదు;' అన్నాడు తండ్రి. ప్రభాకర్ మంచి ఆదర్శాలుగల యువకుడని విన్న పరంధామయ్య నిర్ఘాంతపోయాడు.

'రాధకేం లోటు! మంచికుటుంబంలోంచి వచ్చిన పిల్ల. చదువూ, సంగీతం ఉంది. అయినా సుఖమయ జీవితానికి నలుపూ, తెలుపూ యేవిధంగానూ తోడ్పడవు కదూ!' అన్నాడు. పరంధామయ్య మాటలు యధార్థాలవడంవలన ప్రభాకర్ తండ్రి కొంతసేపటి వరకూ సమాధానం చెప్పలేకపోయాడు.

'అమ్మాయి యిష్టపడనప్పుడు యిక యెన్ని చెప్పినా లాభంలేదు కదూ' అని ఆ ప్రసంగాన్ని అంతటితో త్రుంచేశాడు. పరంధామయ్య చాల బాధపడ్డాడు. కేవలం స్టేజియెక్కి ఉపన్యాసాలిచ్చేవరకే ఆదర్శాలని, వాస్తవిక జీవితంలో కార్యశూన్యులని గ్రహించాడు. ఇంతవరకు యెన్నో వివాహాలకు మధ్యవర్తిగా ఉండి ఘనంగా జరిపించిన పరంధామయ్య అవమానం జరిగినట్లు ఫీలయాడు. కాని శ్రీరాంతో యేమీ చెప్పలేదు.

◆ ◆ ◆

సాయంత్రం అరైంది. క్లబ్బులో మెంబర్లు చాల మంది కాలక్షేపానికి వచ్చారు. కొందరు టేబిల్ టెన్నిసు, బాడ్మింటన్ మొదలైన ఆటల్లో పడ్డారు. మరికొందరు పత్రికలు చదువుకోసాగారు. పరంధామయ్య, ప్రభాకర్ మరికొందరు మెంబర్లు అప్రయత్నంగా ఒక టేబిలువద్ద కలిశారు. రాజకీయాలతో ప్రారంభమైన సంభాషణ యెన్నో విషయాలవైపు మళ్లింది.

'అమెరికనులు నీగ్రోలను నల్లవాళ్ళంటూ బాధపెట్టడం. బ్రిటిషువారు ఇండియన్లను అవిధంగానే హేళన చేస్తూ కష్టాలపాలు చేయడం తల్చుకుంటే బాధగా ఉంటుంది. అవిధంగా చేయడంలో వారికి లభించే దేమిటో నాకు అర్థంకాదు,' అన్నాడు పరంధామయ్య.

'విద్యావిజ్ఞానాల్లో యెంత గొప్పవారైనా తోటి మానవుల నాదరించడంలో మటుకు సంస్కారాన్ని చాటుకోలేకపోయారు,' అన్నాడొక వ్యక్తి.

'అవును! తోటివారు కష్టాల్లో ఉన్నప్పుడు కేవలం రంగు విభేదంతో నిరాదరణ చేయడం మానవత్వమనిపించుకోదు,' అన్నాడు ప్రభాకర్.

'అయితే రంగువిభేధాన్ని పాటించకూడదంటావా ప్రభాకర్?' పరంధామయ్య ప్రభాకర్ని పరిశీలనగా చూస్తూ అడిగాడు.

'ఒక్కనాటికీ రంగుని, బాహ్యాడంబరాన్ని లక్ష్యపెట్టరాదు,' అన్నాడు ప్రభాకర్ ఆవేశంతో.

"నీ అభిప్రాయం అమూల్యమైనది ప్రభాకర్! ఇతరదేశాలవారు నల్లవారిని నిరాదరణ చేశారని బాధపడుతున్నాం. కాని యీ రోజుల్లో మన దేశంలోనే రంగుని, బాహ్యాడంబరాన్ని ముఖ్యంగా పరిగణించి అమృతహృదయాలని సహితం తిరస్కరిస్తున్నారంటే ఆశ్చర్యపడతావేమో?" అన్నాడు.

"పరస్పరమైన ఆత్మీయతయందు పైమెరుగులకే మాత్రమూ ప్రాముఖ్యత నీయకూడదు. అట్లాయివ్వటం మూర్ఖతే అవుతుంది." అన్నాడు ప్రభాకర్ తన వ్యక్తిగత జీవితం గురించి మర్చిపోయి, కాలేజీలో చదివేటప్పటి ఆదర్శాలు పూర్తిగా వప్పగించేశాడు.

"నీ ఆదర్శాలు ఉత్తమమైనవి ప్రభాకర్! అందరూ నీలాగే యీ ఆదర్శాలను దృష్టిలో పెట్టుకొని ఆచరణలో పెట్టగలిగితే దేశం బాగుపడుతుంది" పరంధామయ్య సూటిగా బాణం వదిలాడు. చటుక్కున ప్రభాకర్ తేరుకున్నాడు. ముఖం వివర్ణమైంది. వ్యక్తిగత జీవితంపై పరంధామయ్య మాటలు ఎంతటి ప్రభావాన్ని చూపాయోనని ఆశ్చర్యపోయాడు. మొదట కోపం వచ్చినా పరంధామయ్య మాటల్లో సత్యం ఉందని తోచింది. మౌనంగా ఉండిపోయాడు, కొంతసేపయాక "వెళ్ళివస్తాను." అని గబగబా వెళ్ళిపోయాడు. ఇదంతా గమనించిన పరంధా

మయ్య తన పథకం ఫలిస్తున్నట్లు గుర్తించి లోలోపలే నవ్వుకున్నాడు.

◆ ◆ ◆

పరంధామయ్య మాటలు ప్రభాకర్‌ని వెన్నాడుతూనే ఉన్నాయి. ఆతని మాటలు నిజమని, తనది తప్పనితోచేది. తను రాధను చూచినప్పుడు ఆమె కళ్ళల్లో వ్యక్తమైన ఆవేదన గుర్తు వచ్చేసరికి బాధ కలిగేది. ఆమె వివాహం కోసం వారెంత కష్టపడుతున్నారో అనిపించేది. రాధలో యేంలోటున్నదని తిరస్కరించాడు తను! నల్లనిదైనా తీరైనముఖంకలిగిన రాధ, తన కాలేజీ ప్రిన్సిపాల్ చేతకూడ గుణవంతురాలని ప్రశంసించబడిన రాధ. ఎన్నదగిన వ్యక్తి కాదూ! ఆమె మధురగానం తనను దివ్యలోకాలకు తీసుకపోలేదూ! అటువంటి రాధముందు ధనంవిలువ పొజిషన్ ప్రాముఖ్యత యేపాటివి? నిజంగా, ఉత్తమురాలైన రాధను భార్యగా పొందగలగడం యెంత అదృష్టం! పరంధామయ్య నిష్కల్మషమైన వ్యక్తి కాబట్టే తనకు నిజాన్ని సూటిగా తెలిపాడు! ప్రభాకర్ ఆలోచన లీవిధంగా ఉండేవి. చివరకు రాధనే చేసుకోవాలనే నిశ్చయానికి వచ్చాడు.

ఆ రోజు కాలేజీనించి అప్పుడే వచ్చిన ప్రభాకర్‌కి కాఫీ యిస్తూ, "జడ్జీగారి అమ్మాయిని చూడటానికి రేపు వెళ్దాం ప్రభాకర్! ఆ అమ్మాయి అందంగా ఉంటుందిట. వాళ్లు మన హోదాకి తగినవాళ్లు;" అన్నది హుందాగా తల్లి. ప్రభాకర్ కొంతసేపు మౌనంగా ఉండిపోయాడు,

కాఫీ కప్పు తీసుకుని వెళ్లే తల్లిని, 'అమ్మా!' అని పిలిచాడు.

"ఏమిటి బాబూ?" అన్నది వాత్సల్యంగా కొడుకు వైపు చూస్తూ.

"నేను శ్రీరాంగారి రాధను చేసుకుంటానమ్మా!" అన్నాడు.

"వారు మనకి తగరని. అమ్మాయి నల్లగాఉంటుందని తెలిసి యింకా ఆ ప్రసక్తి యెందుకు?" అన్నది.

"డబ్బూ, హోదా ఒక్కనాటికి ముఖ్యం కావమ్మా! మంచి హృదయంకంటె కోరదగినదేమీ లేదు" అన్నాడు. ప్రభాకర్ మనసులోని అభిప్రాయాన్ని గ్రహించిన తల్లి అతన్ని బాధపెట్టడం యిష్టంలేక, 'నీ సౌఖ్యంకంటె మాకు కావలసిందేమీ లేదు ప్రభాకర్! తప్పకుండా రాధనే చేసుకో!' అన్నది. తండ్రికూడ అడ్డుచెప్పలేకపోయాడు.

◆ ◆ ◆

వారం రోజుల తరువాత ఒకనాటి ఉదయం తన యింట్లో అడుగుపెట్టిన ప్రభాకర్‌ని చూచి పరంధామయ్య ఆశ్చర్యపడలేదు. తన ప్రయత్నంమీద అతనికి నమ్మకం ఉంది.

"రా నాయనా! కూర్చో," సాదరంగా ఆహ్వానించాడు.

"నేను రాధను పెళ్ళిచేసుకుంటాను. ఆశీర్వదించండి" అని నమస్కరించాడు. పరంధామయ్య సంతృప్తిగా చిరునవ్వు నవ్వాడు.

"శుభం నాయనా! నీ అభిప్రాయాల్ని ఆచరణలో పెడుతున్నందుకు చాల సంతోషంగాఉంది. ఉత్తమురాలైన రాధతో నీ జీవితం మధురంగా ఉంటుంది," అన్నాడు.

తేలికపడిన హృదయంతో ప్రభాకర్ యింటికి వెళ్ళిపోయాడు.

శుభముహూర్తంలో రాధా ప్రభాకర్‌ల వివాహం జరిగిపోయింది.

◆ ◆ ◆

ప్రభాకర్ మాటలు నాకు చాల ఆనందాన్ని కలిగించాయి.

"రాధ నా దేవత, మా యింట్లో అందరికీ రాధంటే ప్రాణం. నేను అదృష్టవంతుడిని" అన్నాడు ప్రభాకర్.

చీకటి పడటంవలన యింటికి బయల్దేరాం. వెళ్లేసరికి అత్తగారి యెదురుగా కూర్చుని రాధ వీణ వాయిస్తూంది. ఆమె నిర్మలవదనంలోని కాంతిని మొదటి సారిగా గుర్తించిన నేను ప్రభాకర్ మాటలు నిజమనుకుంటూ మేడ మీదకు వెళ్ళిపోయాను.

—o—

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧౦౯

**అతిశయ** పాపంబులడంచి, రాగ ద్వేష
ముల, నాశనముసేయు ముఖ్యమంత్ర
మోంకార స్థానమైయొప్పెడి మంత్రంబు
అజహరుల్ జపియించునట్టి మంత్ర
మఖిలమునిగణము లాశ్రయించెడి మంత్ర
మఖిల విశ్వముల, విఖ్యాతమైన
రామ మంత్ర మఖిల ప్రాణుల 'నిర్వాణ
మంత్రము ; రఘుపతి మంత్రమరయ
ముక్తి మార్గైక మంత్రంబు; భక్త సులభ
మంత్ర మారాతసులద్రుంపు మంత్రమమరు
లహరహము జపించెడు మంత్ర మవనినాకు
పట్టుగొమ్మయై విలసిల్లు భద్రగతిని

౧౧౦

సంసార భయముల సంహార మొనరించు
మంత్రంబు! మానుల మాన్యమంత్ర
మఖిల శాస్త్రములందు నానందకరముగా
వరలెడి మంత్రంబు; భర్గుడెపుడు
జపియించు మంత్రంబు ; జన్మ సాఫల్యంబు
సలిపెడి మంత్రంబు; జనన మరణ
బాధల మాన్పు, దివ్యంబైన మంత్రంబు
సర్వ వేదంబుల సార మంత్ర
మభయ మొసగెడి మంత్రంబు ; శుభము
లంద
జేయుకైవల్య మంత్రంబు చిత్త శుద్ధి
దలచు నెవ్వాడు - వాడెపోధన్యతముడు
సత్యలోక సుఖముజెందు – నిత్యముగను

౧౧౧

అజ్ఞాన జనితమైనట్టి సంసార, మ
హా సాంద్రమును, బడబాగ్ని చేత
గాల్చెడు శ్రీరామ! కరుణ, నాపైజూపు
మయ్య! ముకుంద! ప్రహ్లాదవరద!
అవ్యక్తతత్త్వ నిత్యప్రణవాధి రూ
ఢుడయిన శ్రీరామ! జడమతులయి
తపియించు వారము ; తాపత్రయంబుల
మృత్యువాసన్నమై మించుతఱిని
స్మరణసేయంగ లేను; కంసారి! కలుష
హారి ! సీతాపతీ! నేడె హాయిగాగ
దలచుచున్నాడ నిన్ను, మాధవ! ముకుంద!
నాదు తాపత్రయంబు బోనాడుమయ్య!

౧౧౨

శివుని స్వరూపమై జెన్నారు 'శంకర
స్వామి,' లిఖించె గీర్వాణ భాష

'రామకర్ణామృత' రసకావ్యమాదిలో
నంతఁ జేకూరు వంశాబ్ధి వెలసి
నట్టి సిద్ధ కవీశ్వరాహ్వయుండనుపమ
శ్రద్ధ నాంధ్రంబున వ్రాసి రామ
కర్ణామృతంబును కడక నీకర్పించెఁ
బూడండగాఁడన పొత్తి మతుల
భక్తి నద్దాని వినుతించి పంకజాక్ష!
చిన్న పూమాలఁ గూర్చితి; చిన్నెవన్నె
లేమియెఱుఁగను; ధరియింపు మినకులేశ
యుడుతభక్తిని కాదనకోయి నీవు!

౧౧౩

వసుమతిఁ గాశ్యపావతారనై ప్రభ
ము, త్రియాంరుషేయంబు 'ముదముగాగ
ప్రవరాన్వితము-కాశ్యపసగోత్ర మాశ్వలా
యన సూత్రమందుపై యధ్యయనము
బుశాఖ; మాతండ్రి కృష్ణార్యుఁడవిరళ
విష్ణుసేవామృత తృష్ణఁగలడు
మధ్వమతస్థుండు - మధువైరి నిత్యంబుఁ
బూజించు భక్తుండు పుణ్యశాలి
యతని భార్య - అశ్వత్థమ్మ - యామె
కేము

ముగ్గురము బుత్రకులము, సమ్ముదముతోడ
జ్యేష్ఠుఁడ, నహోబలాహ్వయ శ్రీ విలాసుఁ
డను, కరుణతోడ శ్రీరామ! వినగదయ్య!

౧౧౪

ద్వైత - మద్వైత - తత్త్వంబులు. శ్రీవిశి
ష్టాద్వైత తత్త్వంబులరయ నొకటె
మున్మతములను, ప్రియమ్ము నాకున్నది
ముగ్గురాచార్యులు మునము నాకు
సంకల్ప శుద్ధి - విచారంబు - సద్భక్తి
సద్గురుసేవ - ప్రశాంతతపము
నాయభీష్టము; రామనామామృతముగ్రోల
నా జిహ్వకోరు ననారతంబు
నాకు పాఠంబు రామకర్ణామృతంబు
ముప్పదియుపైగ నేండ్లు; సంపూర్ణ మమత
వ్రాసినాఁడను నా నేర్చు భంగి దీనిఁ
గైకొనుము; జానకీనాథ! కంజనేత్ర

౧౧౫

తెలుఁగు వారికెల్లఁ దేట తెల్లముగాఁగఁ
దెలుఁగు బాస తీపి తెలియునట్లు
రచనసల్పినాఁడ - రామకర్ణామృత
మాదరింపుఁడయ్య! యాంధ్రులార!

౧౧౬

కీలుబొమ్మగ నన్నుంచి, కృపదలిర్ప
నినకులాభరణుండు వ్రాయించి నాడు
రెండవప్రకరణము, ధన్యుండనైతి;
దండ మర్పింతుఁ గోదండ ధారునకును.

౧౧౭

మాలిని

అవనిజ ప్రియమూర్తీ! ఆర్యసన్మానకీర్తీ!
ప్రవిమల గుణవర్తీ! పాప సంతాపహర్తీ!
దివిజ నుత చరిత్రా! ధీరకౌసల్యపుత్రా!
రవికులగుణధామా! రమ్య శ్రీరామ
నామా

ద్వితీయాశ్వాసము సంపూర్ణము
ఓం - శ్రీరామచంద్రాయనమః

# ఆ రోజులూ - ఈ రోజులు

శ్రీమతి చివుకుల లక్ష్మీ పున్నయ్య



రుక్మిణి చదువుకుండే రోజులలోనే శీవిగా నుంటుండేది. ఆమె దృష్టిలో పురుషులు అవకాశవాదులు, స్వార్థపరులు, మర్యాద మన్ననలు తెలియనివారని. ఆమె సాధారణంగా స్కూలులో ఏకొద్దిమందితోనో మాట్లాడేది. పురుషులపట్ల ఆమెకుగల ఏవగింపును చూచి తోడి విద్యార్థులు అనేక విధాలుగా చెప్పుకొనేవారు. ఆమె వాలకం గర్వము, శీవిసూచకంగా నుండేవి. ఆమెకు మహిళా ఉద్యమమన్నా, స్త్రీ స్వాతంత్ర్యమన్నా ఆసక్తిమెండు. పురుషులతోపాటు స్త్రీల సమాన హక్కులు, అవకాశములను గురించి స్కూలులో విద్యార్థుల సమావేశాలలో గంభీరంగా ఉపన్యసించేది. స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసయి లైబ్రేరీపిస్టుగా ఉద్యోగం చేరిన తరువాతకూడ మహిళా ఉద్యమంలో నిర్విరామంగా పనిచేస్తుండేది.

రుక్మిణి తల్లిదండ్రులు సామాన్య కుటుంబీకులయినా ఏకైక పుత్రిక, మగసంతానం లేకపోవడం వలన చాల గారాబంగా పెంచి స్కూలు ఫైనలుదాక చదువు చెప్పించారు. ఒక చేతిలో తోలుసంచి, మరొక చేతిలో గొడుగు, కండ్లకు జోడు, కాళ్లకు స్లిప్పర్సు జోడు రుక్మిణిని సంపన్న గృహస్తుని కుమార్తెగా రూపొందించేవి. చేతిలోని సంచిలో పట్టుమని అర్ధరూపాయి చిల్లరడబ్బులు లేకపోయినా, యింట్లో పచ్చడి మెతుకులుతిన్నా బయటికివచ్చేటప్పటికి చలువమడతలు చెరగని దుస్తులతో ముస్తాబయి, చెప్పుకోడం తమ యింట్లో పాలు, పండ్లు, క్యాబేజి, కాలీఫ్లవరు, బఠాణి, టమాటోలలాంటి ఆహారపదార్థములుతప్ప యితరము నెరుగనట్లుండేది. కాని పూజపర్వదినాలలో ఆఫీసునందు ప్రసాదమునకు ఎగబడే ధోరణిమాస్తే అరటిపండ్ల ముఖము ఆమె ఏనాడు ఎరుగదేమోననిపించేది.

ఆమెకు దాంపత్య జీవితమంటే గిట్టదు. ఎవరైనా తన పెండ్లిని గురించి ప్రస్తాపిస్తే తాను పెండ్లిచేసికొని పురుషునకు బానిసకావడం ఎన్నటికి జరుగదని రాయి గుద్ది చెప్పేది. ఆమె పెంకెతనాన్ని చూచి వారింటి చుట్టు ప్రక్కలవాళ్లు "పెండ్లిచేసుకోకుండా ఎంతకాలముంటావో చూద్దాం!" అంటుండేవాళ్లు. ఆఫీసులోనయినా తన పనిని వంచిన తల ఎత్తకుండా చేయడం, యింటికి బయలుదేరడమేకాని యితరులతో మాట, మంచి యుండేదికాదు.

ఒకసారి మహిళాసభ వార్షికోత్సవ సమావేశంలో సంఘంలో పురుషులవలన స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలను గురించి, పురుషుల దాస్యమునుండి ముక్తినిపొందుటకు స్త్రీలు విద్యావతులై స్వతంత్ర జీవనమున కలవాటుపడవలసిన ఆవశ్యకతను గురించి, స్త్రీ స్వాతంత్ర్యమును గురించి తీవ్రంగా నుపన్యసించింది. కరతాళ ధ్వనుల మధ్య అనేకమంది స్త్రీలు ఆమెను అభినందించారు. సమావేశం ముగియగానే రిక్షాఎక్కి యింటికి బయలుదేరింది.

రాత్రి షుమారు 9 గంటల సమయం. రోడ్డు ప్రక్కన దీపాలు దూరదూరంగా నున్నవి. దీపాల వెలుతురు కాంతివిహీనంగా నున్నది. జనసంచారము, సందడి తగ్గిపోయింది. రిక్షా వడిగా సాగిపోతున్నది. దాని వెనకాల కొంత దూరంలో నలుగురు సైకిళ్లమీద మాట్లాడుతూ వస్తున్నారు. కొంతదూరం పోయేటప్పటికి "రుక్కూ" అని పిలచినట్లు వినబడింది. రుక్మిణి గుండె దడదడలాడింది. అయినా ధైర్యము చిక్కబట్టుకొని వెనక్కుతిరిగి చూచింది. తనతో స్కూలుఫైనలు క్లాసు చదువుకున్న శ్రీధర్ చిరునవ్వుతో "రుక్కూ! యీ రోజున నీవు మహిళాసభలో యిచ్చిన ఉపన్యాసానికి అభినందించదలచివచ్చాము" అన్నాడు సైకిలును ప్రక్కగా రానిస్తూ. అతని వెంబడే ముగ్గురు స్నేహితులు ముందుకొచ్చి రిక్షాను చుట్టుముట్టారు.

"అభినందించడమేమిటిరా ! ఆమెను పెండ్లి చేసుకోదలచివచ్చానని చెప్పరాదూ !" అన్నాడు ఒక స్నేహితుడు.

మరొకడు "ఈ రాక్షసిని చేసికొని వాడేం ఏగ కలుగుతాడురా !" అన్నాడు.

రుక్మిణికి చిరుచమటలు పట్టినాయి. కండ్లు ఎర్ర బడ్డాయి. కోపావేశంతో "షటప్ ఫూల్స్" అని గర్జించి రిక్షాను త్వరగా పోనియ్యమని గదమాయించింది.

రిక్షావాడు "ఇదేమిటి బాబయ్యా ! అర్ధరాత్రిప్పుడు అంకమ్మ శివాలన్నట్లు ఒంటరిగా పోతున్న ఆడపిల్ల వెంబడి కుక్కలు నక్కలలాగ వెంట బడ్డారు" అంటూ రిక్షాను ముందుకు సాగనిచ్చాడు. స్నేహితులతో శ్రీధర్ మారుమాట్లాడకుండా జారుకున్నాడు.

అప్పటినుండి శ్రీధర్ రుక్మిణి కనుపించినప్పుడల్లా చిరునవ్వు విసిరేవాడు. ఆమెను వర్ణిస్తూ పద్యాలు, పాటలు వ్రాసి పోష్టులో నామెకు పంపేవాడు. ప్రతినిత్యము రుక్మిణిగారి యింటిముందు అటుయిటు చూడ్కులు నిగిడిస్తూ కనీసం అయిదారుసార్లయినా తిరిగేవాడు. అది చూచి ఛీదరించుకున్నవి, తిట్టినవి, కడకు కొట్టబోయిన రోజులుకూడ యున్నవి. కాని శ్రీధర్‌కు మాత్రం రుక్మిణిమీద మోజు తగ్గలేదు.

రుక్మిణి ఎంతపట్టుదలగా తన వివాహమునకు వ్యతిరేకియయినా యీడువచ్చినపిల్ల కావడం వలన తల్లిదండ్రులు పెండ్లిచేయ నిశ్చయించారు. తనకు పెండ్లి వద్దంటే వద్దని మారాంపెట్టి, ఏడ్చి, అఘాయిత్యంచేసింది. కాని తల్లిదండ్రుల నిర్ణయం మారలేదు. పాపం నిస్సహాయరాలైంది. వివాహ ప్రయత్నాలు శరవేగంగా సాగిపోతున్నవి. మరి వరుడెవ్వరో ! కనీసం తానొకసారి చూడనైనా లేదేయనుకోసాగింది. పోనీ తనుచూడకపోయినా చేసికొనబోయేవాడైనా తన్నుచూడలేదేమాయని మధనపడసాగింది. ఈ కలవరంతో తిండిమానేసి నిరాశ నిస్పృహలతో రోజులు దొర్లిపోతున్నవి. తీరా ఆ రోజు రానేవచ్చింది - మేళతాళాలతో, పందిట్లో యధావిధిగా వివాహంజరిగింది. కనీసం మంగళ సూత్రం కట్టేటప్పుడైనా వరుడెట్టివాడో చూడసాహసించిందికాదు. మరి పెండ్లిలో కట్న కానుకలంటారు, నడతలంటారు, వేడుకలంటారు— అవేమిలేవు అక్కడ. పెండ్లి క్లుప్తంగా జరిగింది. వంచినతల ఎత్తని రుక్మిణి తనీలోకంలోనున్నట్లే భావించలేదు.

ఆ రాత్రే ఆ నూతనదంపతులను గదిలోకి పంపేశారు. పూర్వాచారపరాయణులు యిదేమి విడ్డూరమమ్మా! అన్నారు. మరి యింకా కొందరు చాదస్తపు ఆడవారు గది కిటికీసందులలోనుండి, తలుపుసందులలోనుండి నక్కినక్కి చూడసాగేసరికి రుక్మిణి తండ్రి గదమాయించాడు. దాంతోటి ఎక్కడివారక్కడ పడుకొని నిద్రపోయారు.

గదిలోరుక్మిణి తలవంచుకొని నిలుచున్నది ఒక మూల. మంచముపై పరుపుమీద చలవదుప్పటి పరచి దిండ్లు, దుప్పటియున్నవి. మంచము ప్రక్కగా చాపబరచియున్నది. అక్కడే ఒకప్రక్కన చిన్న బల్లమీద వెండిపళ్లెంలో తిను బండారాలు, పండ్లు యున్నవి. అగరువత్తులవాసన ఘుమాయిస్తున్నది.

మంచంమీద కూర్చుంటూ "రుక్కూ !" అన్నాడు యువకుడు.

ఆ పిలుపు తనకేదో పరిచయమున్న కంఠస్వరమనిపించింది రుక్మిణికి; అయినా నిశ్చలంగా నిలబడియుంది. యువకుడు మెల్లగా ఆమె వెనుకకుపోయి జడలోని రోజాపూవులను సవరిస్తూ "రుక్కూ !..." అని పిలచాడు మరల. అది ఆమెకు ఎలెక్ట్రిక్ షాకులాగుండింది. తలెత్తి వెనక్కు తిరిగి చూచింది. కళ్లు వికసించినవి. పెదిములమీద చిరునవ్వుచిందింది.

"శ్రీధర్ !..." అన్నది

"అవును రుక్కూ ! నీకోసం తపించి తపించి చివ

రకు నీ చేత చీవాట్లు... తిని ఎలాగైతేనేం యీనాడు విజయం నాదయింది. మరి యీ విజయం నీది కూడా కదూ!'' అన్నాడు శ్రీధర్.

రుక్మిణి కేమనాలో తెలియలేదు. తనది ఓటమని ఆమెహృదయం ఘోషించింది. అయినా యిందులో ఓటమేముంది? అందరు ఆడవాళ్లలాగే కుటుంబ అవకాశాలకు, హక్కులకు సమానభాగస్వామిగా ఆదర్శనీయమగు దాంపత్యమును గడుపుచున్నానుగదా యనుకున్నది.

''ఏమిటి రుక్కూ! ఆలోచిస్తున్నావు! మన ముభయులము ఒకరినొకరము అర్థముచేసికొని సంసారయాత్రసాగిస్తే ఉమ్మడి భాగ్యానికి లోటుండదు. కాని నీ పెంకితనంమాత్రం...'' అన్నాడు శ్రీధర్ ఆమెను తన కౌగిలిలోకి తీసికుంటూ.

''మీరు పాపం బహుబుద్ధిమంతులు కాబోలు! ఒంటరిగా చీకట్లో పోతున్న ఆడపిల్లవెంబడిపడిన పెద్దలు... '' అన్నది రుక్మిణి శ్రీధర్ బాహువులలో నలిగిపోతూ. ఆమె పెదవులు అతనికి స్వాగత మిచ్చాయి.

ముగ్గురు పిల్లలతో రుక్మిణి భర్తతో కాపరం చేస్తూ ఎవరైనా ''పెళ్లి వద్దు వద్దంటూ ముగ్గురు పిల్లల్ని...'' అని నవ్వుతూ అంటే ''అవి ఆరోజులు, యివి యీరోజులు'' అంటుంటుంది.

——(౦)——

# సిరిసిరి మువ్వలు

అమెరికన్ కోటీశ్వరుడు రాక్ఫెల్లర్ ఒకసారి పెద్ద హోటలుకువెళ్లి సెకండు క్లాస్ గది కావాలని అడిగాడు. హోటలు యజమాని అతనిని గుర్తించి ''మీ కుమారుడు యిప్పుడు మా హోటల్లో ఫస్టుక్లాసు గదిలో నుంటున్నాడండీ!'' అన్నాడట.

''అవును – వాడి తండ్రి కోటీశ్వరుడు రాక్ఫెల్లర్. మా తండ్రి కోటీశ్వరుడు కాడాయెమరి!'' అన్నాడు రాక్ఫెల్లర్.

♦ ♦ ♦

అనటోల్ఫ్రాన్స్ తన మిత్రులకు సలహాయిస్తూ ''పుస్తకాలు ఎవరికీ ఎరువీయవద్దు. అలా యిచ్చిన పుస్తకాలు మళ్లీ తిరిగిరావు. దీనికి రుజువుకావాలంటే ప్రస్తుతం మా యింట్లోని లైబ్రరీని చూడండి – అందులోని పుస్తకాలన్నీ నేను స్నేహితుల దగ్గర ఎరువుతీసికున్నవే'' నన్నాడు.

♦ ♦ ♦

''మర్యాద అంటే ఏమిటినాన్నా!'' అని కొడుకు తండ్రి నడిగాడు.

''మర్యాదంటేనా – నీ యజమాని 'ఏమిటి దీని అర్థం?' అని అడిగేవరకు నీవు నీకున్నదని అనుకునేది'' అన్నాడు తండ్రి.

అల్లంకి చెల్లారాం

# సరయు - రవికాంత్

శ్రీ భరణి

కారు పోర్టికోలో ఆగింది. సరయు గబగబా మెట్లెక్కి గదిలోకి వెళ్ళి కిటికీలో గుండా తొంగిచూచింది. కారులో కూర్చున్న రవికాంత్ చేయి ఊపాడు. సరయుకూడా చేయి ఊపింది. కారు కదిలింది. కనుచూపు దాటేంతవరకు కారును చూస్తూ నిలబడింది.

పుస్తకాలు బీరువాలో పెట్టింది. ఏం చేయాలి అని ఒక్క క్షణంపాటు ఆలోచిస్తూ నిలబడింది. రవికాంత్ మళ్లా వస్తానని చెప్పలేదు - తను అడగటం మరిచింది. డ్రెస్ చేసుకొని క్లబ్బుకు పోవాలనిపించింది. నిలువుటద్దం ముందు నిలబడి ఆపాద మస్తకంగా పరీక్షించుకొంది. నీలిరంగు చీర తన వంటికి యెంతో అందంగా వున్నట్టనిపించింది. అవును-అందంగానే ఉంది. రవికాంత్‌కి నచ్చింది-మళ్లీ మళ్లీ చూచుకొని మురిసిపోయింది. ఎన్నడూలేని ఆనందం ఈ నాడు కలుగుతోంది. అర్థంకావటంలేదు. ముప్పాతిక భాగం పూర్తిచేసి వదిలేసిన "భగ్నజీవి" నవల గుర్తుకొచ్చింది. కథానాయికి చిన్నప్పుడు యెన్నో కష్టాలుపడి ఒక యువకుడ్ని ప్రేమిస్తుంది. ఆ యువకుడు మోసంచేస్తాడు. తొలిసారి యువకుడ్ని కలుసుకొన్నప్పుడు కథానాయికి మాటలు స్ఫురణకు వచ్చినయ్. "ఎన్నడూలేని ఆనందం ఈ నాడు ... అంధకారంపోయి వెలుగువస్తున్నప్పుడుండే సంతోషం ... చందమామ ముందున్న కారుమబ్బులు తేలిపోతుంటే కనుపించే నవ్యత. భావి జీవితం క్రొత్త దారులు త్రొక్కబోతుంటే ఏహృదయం ఉప్పొంగిపోదు ..." కథానాయికి నిలువుటద్దం ముందు నిలబడి ఎన్నెన్నో కలలు కంటుంది. చివరకు ఆశలన్నీ అడియాశలవుతాయి. గడియారం అయిదుకొట్టింది. ఉలిక్కిపడింది సరయు. చాలా సేపయింది నిలువుటద్దం ముందు నిలబడి "నా కోసం ఎవరన్నా వస్తే క్లబ్బుకు రమ్మను" అని పనివాడికి చెప్పివెళ్లింది సరయు.

♦ ♦ ♦

సరయుని ఇంటి దగ్గర దిగపెట్టి యింటికి వచ్చాడు. కారు గోడ్డుమీద ఆపి యింట్లోకి వెళ్ళాడు. మేడమీద గదిలోకివెళ్లి, చేతిలోని పుస్తకాలు టేబిల్‌మీదపారేసి, కోటు స్టాండ్‌కి తగిలించి, సిగిరెట్టు వెలిగించాడు. ప్రొద్దున కాలేజికి వెళ్ళేముందు డ్రెస్ చేసుకొన్నాడు. దుస్తులు కొద్దిగా నలిగినయ్. నిలువుటద్దం ముందు నిలబడి ఓ సారి చూచుకొందాం అని అను

కొన్నాడు. సిగిరెట్టు పెదిమెలతో నొక్కి పట్టుకొని చేతులు పాంట్ జేబులో పెట్టుకొని అద్దంముందు నిలబడ్డాడు.

చొక్కా నలిగిపోయింది. జుట్టు నుదిట మీద పడ్తోంది. టాయిలెట్ చేసుకొంటే బాగుండుననిపించింది. టాయిలెట్ లేకుండా వుంటేనే సరయుకు నచ్చుతుంది. సరయు ... సరయు ... ఆ పేరులో ఎంతో మృదుత్వంవుంది. శ్రావ్యంగా వుంది. అందంగా కూడా ఉంది. చదువూ ఐశ్వర్యం రెండూవున్న వాళ్లు అరుదుగా కనిపిస్తారు. సరయు ఆశాజ్యోతి, భావి జీవితపు భాగ్యరేఖ ... జీవిత పారభం ... సర్వస్వం ... అంధకార జీవితానికి మెరుపుతీగె. చదువుకొన్న వాళ్లు అప్రమత్తతతో మెలుగుతారు. జీవిత నౌకను సాఫీగా నడుపుకొంటారు. సిగిరెట్టు చివరిదాకా కాలింది. వేలు చుఱ్ఱుమన్నది. చాలాసేపయింది. కాఫీ సేవించి ఫాన్సీబుష్‌కోట్ తొడుక్కొని ... యెక్కడికి వెళ్లుదాంమని ఆలోచించాడు. టెన్నిస్ ఆడుకుంటే బాగుండుననిపించింది మొదట ... కాదు "మాడామ్ బవేరీ" ఆఖరురోజు ... సరయుని తీసుకువెళ్తే బాగుండుననిపించింది. అవును సరయు చూడాల్సిన పిక్చర్ అది.

♦ ♦ ♦

పోర్టికోలో కారు ఆపి సరయు గది లోకి వెళ్ళాడు. అది చాల విశాలమైన గది. ఫ్లవర్ వాజ్‌లు, చిత్ర లేఖ ఫోటోలు, దంతపు శిల్ప ప్రతిమలు అందంగా అమర్చబడినయ్. ఓ మూల బీరువాలో పుస్తకాలు వరుసగా అమర్చబడినయ్. చదువుకునే టేబిల్ మీద సరయు ఫోటో వుంది. ఫోటోముందు నిలబడి...దీర్ఘంగా చూశాడు. సరయు మొహంలో అనంత కోటి అనుభూతులు ప్రస్ఫుటమవుతున్నయ్. ఫోటో చేతిలోకి తీసుకొని చూచాడు. ఫ్రేముకి వెనకవైపు 'తన' ఫోటోఉంది. ఆశ్చర్యమనిపించింది. తనకి తెలియకుండానే ఫోటో సంపాదించుకొంది. ఎన్నాళ్లనుండి తనని ప్రేమిస్తున్నదో ... అనుకొన్నాడు. రహస్యంగా ప్రేమిస్తున్నదా! ఏమో అయితే కావచ్చు. సరయు మనసు నిర్మలమైనది. పవిత్రప్రేమ అంటే సరయుదే!

రెండు క్షణాల తరువాత పనివాడు పైకి వచ్చి "అమ్మగారు క్లబ్బుకి రమ్మన్నారు."

"ఎవర్ని?"

"మిమ్మల్ని రమ్మన్నారు ..ముందుగా చెప్పటం మరచిపోయారట"

"సరే" చేతిగడియారంలో ఆరు దాటింది. సినిమా వేళ అయిపోయింది. కాసేపు కూర్చోని పోవాలననిపించింది. పనివాడు కిందికి వెళ్లిపోయాడు. బీరువాలోని పుస్తకాలు రవికాంత్‌ను ఆకర్షించి

నయ్. ఒక్కొక్క పుస్తకంతీసి చూస్తున్నాడు. నవలలు . . వైజ్ఞానిక పుస్తకాలు, నాటకాలు, తెలుగు ఇంగ్లీషు పుస్తకాలు . . చక్కని గ్రంథాలు. మూలగా నక్కివున్న నల్లఅట్టల పుస్తకం చూడాలనిపించింది. పుస్తకంలాగి పుటలు త్రిప్పాడు. రెండుకాగితాలు క్రిందపడ్డాయి. కాగితాలుతీసిచూశాడు. అవి రెండూ ఉత్తరాలు.

బెంగుళూరు
13-11-1950

ప్రియ సరయు,

నువ్వు వెళ్లేప్పుడు నాకు చెప్పకుండా వెళ్ళావు. ఆశ్చర్యమనిపించింది. మూడు సంవత్సరాలుగా యేర్పడ్డ స్నేహఫలితంగా, ... చివరకు వివాహం చేసుకొందాం అని నిర్ణయించుకొన్నాము. నాకు ఆస్తిపాస్తులు లేవు. ఆ సంగతి నీకు తెలుసుననుకొన్నాను. నీ మీద నా భవిష్యత్తు నిర్మించుకొన్నాను. నిన్ను ప్రేమించటంవలన నా వాళ్లకు దూరమైనాను. ఇంతకుమునుపు ఎన్నో ఉత్తరాలువ్రాశాను. ఏకాకిగా నన్ను వదిలేసి, నాభవిష్యత్తు నిర్మూలంచేయటం .. నీకు తగనిపని.

ఈ ఉత్తరంచూచిన వెంటనే బయలు దేరి వచ్చెయ్యి.

ఇట్లు
"నీ ప్రియ మధు"

ఆత్రుతతో రెండో ఉత్తరం చూశాడు. అది సరయు వ్రాసిన ఉత్తరం – అని నిర్ధారణ చేసుకొన్నాడు.

హైద్రాబాదు
13.12.1950

మిస్టర్ మధు!

నువ్వు వ్రాసిన ఉత్తరం చదివిన మీదట నిన్ను గురించి ఏమనుకోవాలో తెలియటంలేదు. మూడు సంవత్సరాలు పాటు స్నేహితులుగా ఉన్నమాట నిజమే. నిన్ను తప్పక వివాహం చేసుకొంటానని నేను అనలేదు. అనుకోవటం నీ పొరబాటు. ఇకనుంచి నువ్వు ఈలాంటి ఉత్తరాలు వ్రాయటం మానివెయ్యాలి.

ఈ రోజు నేను నాబస మారుస్తున్నాను. అడ్రెసు నీకు అనవసరం.

ఇట్లు
ప్రియసఖి సరయు

రెండుత్తరాలు రెండు సార్లు చదివాడు. సరయు ఇంతమటుకూ ఈ విషయాలు తనకెందుకు చెప్పలేదు? చెవుతే ... ఏమవుతుందో తనకి తెలుసు. అందుకే చెప్పలేదు గబగబా టేబిల్ దగ్గరికెళ్ళి కాగితం తీసుకొని రెండు ముక్కలువ్రాసి, 'తన' ఫోటో ఫ్రేములో నుండి తీసుకొని నిష్క్రమించాడు.

◆ ◆ ◆

రాత్రి ఆలశ్యంగా సరయు ఇంటికి

వచ్చింది. పనివాడ్ని అడిగి రవికాంత్ వచ్చి వెళ్లినట్టుగా తెలుసుకొంది. రవికాంత్ క్లబ్బుకి ఎందుకు రాలేదో అర్థం కాలేదు. కూని రాగాలు తీసుకొంటూ గదిలోకి ప్రవేశించింది. నిలువుటద్దం ముందు నిలబడింది. టేబిల్ దగ్గరకి పోయి ఫోటో చూసింది. ఆశ్చర్య మనిపించింది. రవికాంత్ ఫోటో లేదు. రెండు నిమిషాలు నివ్వెర పోయింది. టేబుల్ మీద నున్న కాగితం విప్పి చదివింది. ధోరణి అర్థం కాలేదు మళ్ళ చదివింది...

హైద్రాబాదు
11-2-1958

మిస్ సరయు

ఈ రోజు సాయంత్రం నీ గదికి వచ్చాను. సినిమాకి తీసుకెళ్దామనుకున్నాను. నువ్వు లేవు. ఊసుపోక కాసేపు కూర్చున్నాను. బీరువాలోని పుస్తకాలు చూచాను. కొన్ని ఉత్తరాలు కనిపించినయ్. నీ అనుమతి లేకుండా చదివాను. క్షంతవ్యుడను. నీ సంగతి పూర్తిగా తెలుసుకొన్నాను. నీ పూర్వ వృత్తాంతమంతా బోధపడింది. అవన్నీ వ్రాయటం అనవసరం. నన్ను మరిచిపో.

శెలవు
రవికాంత్

ఇంత గంభీర భావంతో వ్రాసిన ఉత్తరం చూచి కిల కిలా నవ్వింది. ఎంతనవ్వినా తృప్తికనిపించలేదు. రాత్రి పదిగంటలైంది. పాపం రవికాంత్ కి నిద్రపట్టదు-తనని గురించి ఏమాలోచిస్తాడో ఊహించుకుంటూ కూర్చుంది. భోజనంచేసి టాక్సీ పిలిపించింది. బీరువాలోని ఉత్తరాలు; మూలల్లో నక్కివున్న, సగం చిరిగిన పుస్తకం తీసుకొని, రవికాంత్ గదికి బయలు దేరింది.

టాక్సీ ఆపి రవికాంత్ గదిలోకెళ్ళి తలుపు కొట్టింది. చెదిరిపోయిన జుట్టు, చింతనిప్పల్లాగానున్న కళ్లతో పళ్ళుబిగపట్టి క్రిందకి వచ్చాడు. సరయుని చూచి దూరంగా నిలబడ్డాడు.

'నువ్వెందుకు వచ్చావు?'
"నిన్ను పరామర్శించటానికి'
'అర్థరాత్రి వేళా?'
'అవును. ఇది మంచి సమయం'
'నీకూ .... నాకు సంబంధం లేదు'
'ఉన్నది'
'లేదు'

'నన్ను ప్రేమించావు. ఆశలు కల్పించావు. యిప్పుడు నన్ను వొంటరిగా వదిలివేయటం నీలాంటి పెద్ద మనుషులకు, విద్యావంతులకు తగని పని. నిన్ను ప్రేమించాను. నీ నీడన బ్రతుకుదామనుకొన్నాను. ఇప్పుడు కాదని త్రోసివేయటానికి వీలులేదు."

"సరయు ... నువ్వు ఉపన్యాసాల తోనూ, కబుర్లతోనూ, నన్ను బోల్తా కొట్టించ ప్రయత్నించకు. నేను నీ ప్రియ మధును కాను సుమా!"

"మధు యెవరు?"

"ఓహో! తెలియదు కాబోలు నిన్ను ప్రేమించి .... మోసపోయినవాడు, నీకు ప్రేమ లేఖలు వ్రాసిన వాడు."

"చాలా బాగుంది" ... అని కిలకిలా నవ్వింది. ఆ నవ్వుకు రవికాంత్ మతి పోయింది.

"మిస్టర్ రవికాంత్ - ఆ ఉత్తరాలు నిజమైన ఉత్తరాలు కావు. నేను వ్రాసిన "భగ్నజీవి" నవలలోని కాగితాలు అవి. ఈ వ్రాత ప్రతి చూడు అంతా తెలుస్తుంది. కథా నాయికికి నా పేరు ఉంచటంచే నువ్వు పొరపాటు పడ్డావు. రెండు ఉత్తరాలు ఒకే దస్తూరిలో ఉండటం కూడా గమనించలేదు ..."

వ్రాత ప్రతి చేతికిచ్చింది. వ్రాత ప్రతి ఉత్తరాలతో పోల్చి చూచాడు. నాలుక కొరుక్కున్నాడు.

"క్షమించు సరయు"

"అంత మాట అనకు .... యికనుంచి ఉత్తరాల విషయంలో జాగ్రత్తగా ఉంటాను."

గోడగడియారం పదకొండు కొట్టింది.

"ప్రొద్దు పోయింది...యికనేవస్తాను. హాయిగా నిద్రపో-రేపు ప్రొద్దున మనిద్దరం కలసి ఫోటో తీయించుకొందాం"

గబగబా వెళ్ళిపోయింది. ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు రవికాంత్.

# కామాయని

మూలం :

శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :

శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

(గత సంచిక తరువాయి)

ఇట్లు పశ్చాత్తాపతప్తుడై మనువు నడచి, నడచి కడకు సరస్వతీనదీ తీరముచేరి ఆ తీరముననే శిథిలమైన సారస్వత నగరమునందు జొచ్చినాడు. అచటి వాతావరణమంతయు నిశబ్దమయమై, వేదనాపూరితమై యుండెను. ఆ నగరమున ధ్వంసమైన భవనముల యవశిష్టభాగములం — తానదివరకూ చూచిన ప్రళయ దృశ్యములను జ్ఞప్తికి తెచ్చుచు, నాతని భయభీతచిత్తు నొనర్చెను. ఆతడు వ్యాకుల చేత నుక్కుడై యటేమాచుచుండ, నొక ధ్వని యతని కర్ణముల సోకినది.

"ఓ మనూ, విశ్వాసమయియు, ప్రేమమయియునైన మహిళారత్నమగు శ్రద్ధ నొక తుచ్ఛ వస్తువుగా పరిగణించి పరిత్యజించితివి. భోగవిలాసములలో వ్యతీతమొనర్చు సమయము నే, వాస్తవజీవనమని తలచి, 'వాసన'లను పూర్తినొనర్చుకొనుటయే స్వర్గమని భావించితివి. నీ పురుషత్వమునందలి గర్వాతిశయముతో, స్త్రీకికూడ లోకములో కించిన్మాత్రమైనను అస్తిత్వ మహత్వములున్నవని యామోదింపవైతివి. నీ వధికారివి. ఆమె యధికృత. మనూ! అధికారులకు, అధికృతులకునుగల సంబంధము పామరత్వములోనే యున్నదను జ్ఞానసూత్రమును నీవేల విస్మరించితివో ? "

ఆ ధ్వని విని మనువు కంపనము నందినాడు. ఆ కంఠస్వరము ఒకప్పుడు, తన చిత్తశాంతిని దోచుకొన్న తన పూర్వపరిచితుడగు కామునిదని మనువు గుర్తించెను. ఆతడు తీవ్ర దృక్కులను ప్రసరించుచు కామునితో నిట్లనెను.

"ఏమి - నేనింతవరకును దేనికొరకు తపించి సాధనచేయుచుంటినో అది వట్టి భ్రాంతియేనా? కామదేవా ! ఒకసారి శ్రద్ధను పొందుమని ప్రేరేపించినవాడవు నీవు. నేనామెయందు భోగము ననుభవించితిని. ప్రేమామృతభరితమైన యా జవ్వని హృదయ భాండమును నాకర్పించినది. ఐనను నా హృదయమందలివాంఛ ఏల పరితృప్తము కాకున్నది?"

"నిజమే మనూ, శ్రద్ధ తన ప్రేమామృత భాండమును నీ ముందర్పించినది. కాని శారీరిక సౌందర్యమునకు ముగ్ధుడవై, తత్సౌందర్యానందానుభవజాలమున చిక్కుకొని, అమృతభాండమైన యామె హృదయమును స్పృశింపనైన లేదు ! ఎల్లప్పుడును నేను — నాది అనునవివేకధ్వాంతరాగము నాలాపించుచు వాస్తవిక ప్రేమను గ్రహింపజాలవైతివి. మనూ ! ఒకే శాఖపై పూవులును ముండ్లును కలిసి యుండగా, పూలను నిరాకరించి ముండ్ల నేరికొన్నట్లు, పావన ప్రేమను ప్రక్కకునెట్టి 'వాసనా నలములను' వలచినావు ! తత్ఫలితముగా నీ మనము సదా వ్యాకుల మందుచున్నది. ఇదే నేటిస్థితి ! మనూ! ఈ నీ చేతల ఫలితముననే నీవొనర్చు "నవీన మానవ" సృష్టికూడ సదా భేదభావములలో సతమతమగుచు, నిరంతరము నశాంతికి లోనగుచుండును. నీ సమగ్ర జీవనమే "మానవుని సంగ్రామ రంగమగును. నేజెప్ప

వలసినదింతే — పొమ్ము, జీవితాంత పర్యంతము నిరాశాంధకారమున మునిగియుండుపులే" అని పలికి కామదేవునివాణి శాంతించినది. అంతటను నిశ్శబ్దముగనున్నను, మనువుమాత్ర మశాంత హృదయుడై, అంధకారమువలె దృశ్యమానమగుచున్న భవిష్యమును నిరాశతో తిలకించుచు నటనేయుండెను.

కొంతసేపటికి సూర్యభగవాను డుదయించెను. అన్ని దిక్కులను ఉషఃకాంతులు సువ్యాప్తము లైనవి. పక్షులు కలరవ మొనర్చినవి. మందవాయువులు వీవసాగినవి. అట్టి సుందర వాతావరణమున నొక సుందరబాల మనుని కట్టెదుట నిలువబడినది. ఆ మూర్తి నేత్రముల కొక సాకార మహోత్సవము. సౌందర్య భండారమైన యామె ముఖమండలము మందహాస రుచులతో యందమును వర్ణించుచుండెను. ఆ యవివేణి కురులు వింతెండ తర్కవాదములవలె కుటిలములైనవి. ఆమె మూర్ధము విశ్వమకుటమైన యర్ధచంద్రుని యందము నపహసించుచున్నది. ఆమె నేత్రముల ప్రేమ వైరాగ్యరసము నొకే సరసను వహించు రెండు మనోహర కమలపాత్రములు! ఆమె యుత్తుంగ కుంభస్తద్వయమును జ్ఞానవిజ్ఞాన చిహ్నములు రెండునుకలిసి యుపస్థితములైనట్లు దృశ్యమానమైనది. ద్విరేఫముల మధురగానములచే నిండిన శిరీషమునోలె నామె ముఖము సంగీతభరితమైనది. మను వామె పరిచయమునుకోరి, యిట్లు ప్రశ్నించెను. "ఆలోకమయీ! నీ వెవ్వతెవు! నిను జూడగనే ఖిన్నమైన మనస్సున చైతన్యముదయించును. నారీ! నీ చిరునగవులతో చైతన్యదాన మొనర్చుచు నీ దేహచ్ఛాయలతో స్వర్ణ కాంతులను వ్యాప్తమొనర్చుచున్న సుదతీ నీ వెవ్వతెవు!"

ఇడ:— నేనా! నా పేరు 'ఇడ' మీ రెవ్వరో — ఇచ్చటనేల తిరుగాడుచుంటిరో నే నెరుగ వచ్చునా?

మను:— నేను క్లేశమును సహించుచు జీవనయాత్ర నొనర్చుచున్న విశ్వపథికుడను. మను నామధేయుడను.

ఇడ, మనువుయొక్క హతాశాప్రసంగమును నాలకించి, సదయమై మనువునకు స్వాగతమిచ్చి సారస్వత నగరములోనికి కొనిపోయినది. శిథిలమై శోభావిహీనమైన సారస్వత దేశము నామె మనువునకు చూపించుచు నిట్లనెను.

"చూడుము. లోకములో దేనికిని నీవధైర్యపడ రాదు. ఎవరి సహాయముకొరకును చేతులుచాచి 'దేహి' యనరాదు. నీ కాళ్ళపై నీవు నిలువబడు స్వతంత్ర ప్రవృత్తి నలవడజేసికొనుము. ఐశ్వర్యపరిపూర్ణమైన ఈ ప్రకృతి పరమరమణీయమైనది. నీవు పరిశ్రమ నొనర్పబూనుము. ధనధాన్యముల నుత్పత్తి చేసి సంపూర్ణ సారస్వత ప్రదేశమునకు పాలకుడవు కమ్ము. ఈ రాజ్యమునకు నీవే శాసనకర్తవుకమ్ము. శాస్త్రీయవిజ్ఞాన సాధనములతో జడ వస్తువులను కూడ చైతన్యవంతములుగా నొనర్చి, నీ విమల యశమును విశ్వమున వ్యాపింపజేసికొనుము."

ఇడ, తన యుత్సాహవర్ధక ప్రసంగముతో, మనువునందొక నవ్యస్ఫూర్తిని సంచరింపజేసినది. అందులకు మనువు తన కృతజ్ఞతను ప్రకటించుచు "నేటి వరకు నిద్రాణమైపడియున్న నా మనోభావమను పక్షి నేడే కలరవ కంఠనాద మొనర్చుచులేచి, ఇచ్ఛాభరితమైన ప్రేమతరంగమువోలె నర్తన మొనర్చుచున్నది — ఇడా! ఇదియంతయు నీ సందేశ ప్రభావము" అనుచు, అన్ని యాలోచనలను విడనాడి స్వబుద్ధి (ఇడ) నాధారముగగొని సౌఖ్యమును సాధించుటకై కర్మమార్గమును స్వీకరించి, కర్మముననే విలీనుడయ్యెను!

## స్వప్నము

సారస్వత నగరమును పునర్నిర్మింపుమని ఇడ ప్రేమపూరిత స్నిగ్ధవచనములతో మనువు నాహ్వానించెను. తదర్థసిద్ధికై మనువు కార్యరంగమున ప్రవేశించెను. అచట శ్రద్ధ తన నవజాత శిశువుతో దుఃఖమయ జీవనము గడపుచుండెను. భర్తృవిరహాగ్ని సంతప్తయై యామె యస్తి పంజరముగ మారెను.

(సశేషము)

# నీటి బుడగలు

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి



“అబ్బా! ఉండండీ? పువ్వులు నలిగిపోతున్నాయ్!”

“నలిగిపోతే మళ్ళీ కొని తెస్తానుగా!”

“తేవడానికి మీరు రేపు ఉండరుగా!”

“ఉండక ఎక్కడికి పోతానేమిటి?”

“మీ ఊరు”

“నేను వెళ్ళను

“వెళ్ళకపోతే కాళ్ళూ చేతులూ కట్టేసి మరీ పంపిస్తారు”

“ఎందుకని?”

“వెళ్ళి తీరవలసిందే!”

“అదే ఎందుకని?”

“ఎల్లుండి ఆషాఢం ప్రవేశం”

“అయితే!”

“తొలిసంవత్సరం కొత్తల్లుడు ఆషాఢమాసంలో అత్తవారింటివద్ద ఉండకూడదు”

“ఎందుచేత ఉండకూడదు?”

“మీకు ఏమీ తెలీదు. ఆ నెలలో అల్లుడు దాటిన గడప అత్తగారు దాటకూడదు”

“దాటితే?”

“కీడు”

“ఎవరికి”

“అత్తగారికీ, మామగారికీ”

“పోనీలే, మనకు కాదుగదా”

“చాల్లెండి ఎవ్వరైనా వింటే నవ్విపోతారు.”

“ఇంతకూ ఈ నెల్లాళ్ళూ మనకు ఎడబాటు తప్పదంటావ్? పోనీ ఒక చిన్న ఉపాయం పన్నితే?”

“ఏమిటో చెప్పండి”

“నేను మీ యింట్లో ఉండకూడదు, నువ్వు మా యింట్లో ఉండకూడదు. అందుకని యిద్దరం కలసి మీ అక్కగారింటికి పోయి అక్కడే యీ నెల్లాళ్ళూ గడిపితే?”

“చాల్లెండి. నలుగురూ వింటే నవ్విపోతారు”

“ఎందుకని?”

“నా మాట విందురూ? ఈ నెలరోజులూ మీరు ఒంటరిగా ఉండవలసిందే”

“తప్పదంటావా!”

“తప్పదు మరి”

“ఏంచేస్తాం! సరేకానీ మాట-గూట్లో గుసగుసలు ఏలా ఉన్నాయి”

“ఏమిటో సరిగా చెబుదురూ?”

“కొత్తల్లుడికి ఏమివ్వడానికి నిశ్చయించారో?”

“నిర్ణయానికేముంది. ఏవో రెండు జతలు బట్టలు పెడతారు”

“అంతేనంటావా?”

“అంతే”

“మరి డబ్బువిషయం ఏమీ అనుకోవడంలేదేమిటి?”

“అబ్బే! నాకేం తెలీదండీ!”

“మీ యింట్లో విషయాలు నీకు తెలియక పోవడం ఏమిటి! చెప్పు మరి”

“ఓవంద రూపాయలు యిద్దామనుకుంటున్నారు”

“ఒక్కవందే”

“పెళ్ళికిచ్చేరుగా మూడువందలు”

“అవి పెళ్ళికిచ్చినది యిప్పుడిచ్చేవి మనుగుడుపుకి”

“యిప్పుడైనా వందే యిద్దామనుకుంటున్నారు”

“నువ్వు కాస్తరికమెండ్ చేద్దూ? వందరూపాయలు చాలవని”

“నాకేం తెలీదు. నేను చెప్తే నా మీద కేకలెయ్యరూ?”

“ఏడిశినట్టేఉంది నీ తెలివితే-యిటువంటి సమయాల్లోనే నీ తెలివితేటలు చూపించాలి మరి”

“నాకేం! చెప్పి చూస్తాను లెండి”

“చెప్పి ఒప్పించాలి”

2

"యిదిగో నాయనా! ప్రస్తుతానికి ఈ రెండు వందలూ దగ్గర ఉంచుకో. యిప్పుడు చేతిలో లెక్క లేదు. మళ్ళీ వచ్చింతర్వాత యిస్తాను"

"సరే అత్తయ్యా! నేవెళ్ళొస్తాను"

"మంచిది నాయనా. అందర్నీ అడిగేనని చెప్పు. మా పేరిట ఉత్తరం వ్రాయకపోయినా మీ ఆవిడ పేరనైనా ఉత్తరాలు వ్రాస్తూ ఉండు - లేకపోతే బెంగ పెట్టుకుంటుంది"

"అలాగేనండి"

3

ప్రియమైన సుశీలకు,

రాజమండ్రి
29-6-57

యిక్కడ అంతా క్షేమం. అత్తగారినీ మామగారినీ అడిగేనని చెప్పు. ఏదో ఊసుపోడానికి ఉత్తరం వ్రాయడం తప్ప, వ్రాయడానికి విశేషాలు ఏమున్నాయి? తిరుగుటపాలో నే ఉత్తరం వ్రాస్తావు కదూ!

ఇట్లు
సర్వేశ్వరరావు

ప్రియమైన.......... వారికి

కాకినాడ
2-7-57

ఉత్తరం అందింది. వెళ్ళినవెంటనే ఉత్తరం వ్రాస్తారో లేదో అనుకున్నాను. నేను మాత్రం ఉత్తరంలో వ్రాయడానికి ఏమున్నాయి గనుక? అంతా క్షేమం. అత్తమామలకు నమస్కారములు.

యిట్లు "మీ"
సుశీల

రాజమండ్రి
సుశీ, 6-7-57

నాకు యిక్కడ ఏమీ తోచడంలేదు. ఒక్కొక్క నిముషం ఒక్కొక్క యుగంలా గడపవలసివస్తున్నది రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టడంలేదు. నిద్రపోదామంటే నీ జడలోని గులాబీ పూవులే జ్ఞాపకానికి వస్తున్నాయి. షికారుకి వెళ్దామంటే నీ చేతిగాజుల గలగల ధ్వనులు నా హృదయాన్ని కిలకిలా నవ్విస్తున్నాయి. పోనీ ఏమీతోచక ఏ పుస్తకమైనా చదువుకుందామంటే నీ చిరునవ్వులే స్పృహకువస్తున్నాయి. ఏమిచేయనో చెప్పు కలలో కూడా నీ రూపమే.

ఇట్లు
సర్వేశ్వరరావు

శ్రీవారికి నమస్కారములు.

కాకినాడ
10-7-57

మీరు వ్రాసిన ఉత్తరం అందింది. అబ్బా! ఎంత కవిత్వం వెళ్ళబోశారు! ఎంత చక్కగా వర్ణించేరు నన్ను! యింటిదగ్గర ఉన్నప్పుడు ఒక్కసారీ నన్నలా వర్ణించలేదే? వెళ్ళి రెండువారాలు కాలేదు కదా! అప్పుడే యీలాగాభరాపడితే యింకా పక్షంరోజులు ఏలా గడుపుతారండీ! ఒకవేళ ముందు ముందు నాలుగైదు నెలలు ఏకాంతంగా ఉండవలసివస్తే అప్పుడు మరెంతగా చిందులు త్రొక్కుతారో! ఏమీ తోచకపోతే యింటిపనులు చూసుకోండి. రాత్రిళ్ళు అంతగా నిద్రపట్టకపోతే నిద్రపట్టే మాత్రలు వేసుకుని హాయిగా నిద్రపట్టించుకోండి.

మీ,
సుశీల

సుశీ, రాజమండ్రి
14-7-57

అమూల్యమైన నీ ఉత్తరం అందింది. ఉత్తరంలో నీవిచ్చిన సలహాకు సంతోషం. కానీ వాటిని అలవాటు చేసుకునే అవసరం ప్రస్తుతానికి నాకు కలగనందుకు చాలా విచారిస్తున్నాను. నాకు ప్రస్తుతం బాగానే ఊసుపోతోంది. అదృష్టవశాత్తూ నా క్లాసుమేట్ మిస్ సీత నన్ను కలుసుకుంది. మేమిద్దరం కలసి సినిమాలకూ, నాటకాలకూ పోతున్నాం. యిరవై నాలుగు గంటలూ మేమిద్దరం ఆటపాటలతో

కాలక్షేపం చేస్తున్నాం. అందుచేత ప్రస్తుతం నాకు ఏమీ తోచకపోవడం అంటూలేదు. మాత్రలు వేసుకుని నిద్రపట్టించుకునే అవసరంకూడాలేదు. మైగాడ్! అప్పుడే టైము ఆరయింది! వస్తాను. సీతతో కలిసి సినిమాకు వెళ్ళాలి—

సర్వేశ్వరావు

ప్రియమైనవారికి,

దీనురాలు వ్రాయునది.

17-7-57

కాకినాడ

ఇంతలోనే మీరలా మారిపోతారని కలల్లోకూడా అనుకోలేదు. ఆనాటి రాత్రి జ్ఞాపకం తెచ్చుకోండి! నీవే నా ప్రాణం, నీవే నా సర్వస్వం అన్నారు. అమాయకురాల్ని నిజమేనని నమ్మేను. కానీ ఈనాటికి మీ మోసం, దగా అర్థమైంది. కొన్నిరోజుల ఎడబాటువల్ల మీ మనస్సు మారిపోయింది. మీరు పరస్త్రీ వ్యామోహంలో పడ్డారు. కనీసం నేను ఎంత బాధ పడతానో అని ఆలోచించకుండా ఈ సంగతి ఉత్తరంలో వ్రాశారు. ప్రియురాలితో సినిమాకు వెళ్ళే హడావిడిలో సరిగ్గా ఉత్తరం వ్రాయడానికి కూడా తీరిక లేకపోయింది కాబోలు! ఇదంతా నాదురదృష్టం. మీ విలాసాలకు నే నెన్నడూ అడ్డురాను. సాధ్యమైనంతవరకూ ఈ అలవాట్లను మానడానికి ప్రయత్నించండి—శలవు.

అభాగ్యవతి
సుశీల

రాజమండ్రి
20-7-57

ప్రియమైన సుశీలకు,

ఉత్తరం చూసి నీవు నిజంగానే టోకరాతిన్నావు. నామీద వేళాకోళంగా ఉత్తరం వ్రాశావని సరదాగా నిన్ను ఏడిపిద్దామని యీ ఉత్తరం వ్రాశాను. నిజంగానే నమ్మేశావన్నమాట. నాకిక్కడ స్నేహితురాలు ఎవ్వరూలేదు. సినిమాలు, షికార్లు అంతా ఉట్టివి. అంతా కల్పన–యిప్పుడైనా నమ్ముతావా? నమ్మకపోతే వచ్చింతర్వాత నా హృదయాన్నే అడిగి తెలుసుకుందువుగాని–వస్తాను.

ఇట్లు
సర్వేశ్వరరావు

శ్రీవారికి

కాకినాడ
24-7-57

అమ్మయ్య! ఏమిటో అని నిజంగానే హడిలిపోయాను. మొన్నటి ఉత్తరం చూసినప్పటినుంచీ నాకు సరిగ్గా నిద్రాహారాలు లేవంటే నమ్మండి. యిప్పటికి నా మనస్సు కుదుటబడింది. ముఖ్యంగా మీకో విషయం చెప్పాలి. ఊహూ! యిప్పుడు చెప్పను. వచ్చినతర్వాత చెప్తాను. వచ్చేటప్పుడు గులాబీ పూవులు తేవడం మరచిపోకండి.

మీ 'సుశీల'

# కవర్లు చేసిన హడావిడి

శ్రీ ఎస్. ఎమ్. వాడ్రేవ్

"పోస్ట్"

అని కేకవినబడగానే లలితవచ్చి కవరు అందుకుంది. ఇంట్లోకి వచ్చినతర్వాత దాని మీద ఎడ్రస్ తనదేయని తెలుసుకుని చింపి చదువుకుంది.

"ఎవరిదగ్గర్నుంచి?" భర్తకృష్ణప్రశ్న.

"మా అన్నయ్య వ్రాశాడు." భార్య లలిత జవాబు.

ఒకరిమనసులొకరికి తెలుసును కాబట్టి తన భార్య అబద్ధం చెప్పదనే నమ్మకంతో దాంట్లో విశేషాలేమిటని అడగలేదు కృష్ణ. ఎవరికి వుత్తరాలు వచ్చినా యింతే. తర్వాత రెండు రోజులకి ఓ వుత్తరం వచ్చింది. 'మా నాన్నగారు వ్రాశాడ'ని చెప్పింది.

♦ ♦ ♦

పురిటికోసమని లలిత పుట్టింటికి వెళ్లవలసివచ్చింది. మరునాడు కృష్ణ ఆఫీసుకి వెళ్లేసమయంలో పోస్టువాడు ఓ కవరు ఇచ్చి వెళ్ళాడు. అది భార్యపేరవచ్చింది. ఇంకా నెల్లాళ్లదాక రాదుకదా విశేషాలేమి వున్నాయో కవరు తెరిచాడు. సగం లోనే ఆగిపోయాడు. గుండె బేజారెత్తిపోయింది. తల తిరిగినట్లు అయిందతనికి. ఆ వుత్తరం 'శంకర్, MBB'S డాక్టర్ దగ్గర్నుండి వచ్చింది. భార్య యింత నీచ ప్రవర్తనకు గురి అవుతుందని ఎన్నడూ తలచలేదు. తర్వాత రెండు ఉత్తరాలు వచ్చాయి. అవి చదివి దాచేశాడు. మరో నెలరోజులకి లలిత ఆడపిల్లను చంకను బెట్టుకొని వచ్చింది. మర్నాటినుండి ఎడమొహం, పెడమొహంకింద తయారయింది. ఎందుకని అడిగితే తప్పించుకు తిరుగుతున్నాడు. నెమ్మదిగా రోజులు గడుస్తున్నాయి.

కృష్ణ ఆఫీసుపనిమీద ఆగ్రా వెళ్ళవలసి వచ్చింది. జాగ్రత్తగా వుండమని చెప్పి మరీ వెళ్ళాడు. కృష్ణ వెళ్ళిన రెండు రోజులకు అతని పేర ఒక కవరు వచ్చింది. నాలుగు రోజులు దాక రాదుకదా ఆ వుత్తరంలో ఏం ప్రమాదం వుందో తెలుసుకోడం మంచిదని కవరు తెరిచింది. తను అనుకున్నంతపని అయింది. గడగడలాడిపోయింది. ఆ వుత్తరం 'కోకిల' అనే నర్సు దగ్గర్నుండి వచ్చింది. తన భర్త యిలా చేస్తాడని ఎప్పుడూ అనుకోలేదు. ఇపుడు ఆఫీసుపని అని చెప్పి దాని దగ్గరకు వెళ్తారేమో అనుకుంది. తర్వాత మూడు ఉత్తరాలు వచ్చాయి—దాచేసింది. అన్నట్టుగానే నాల్గు రోజుల కల్లా దిగాడు. భార్య మొహంలో ఓ పెద్ద విశేషముందనుకున్నాడు. కారణమేమిటని అడిగితే విసుగులు తసుగులూ, అంతగా అడిగితే చీవాట్లు, చెప్పు దెబ్బలూను. యింకా అడిగితే ఆఫీసు

కైముకి భోజనం దొరకదేమోనని భయపడి అడగడం మానేశాడు.

♦ ♦ ♦

శంకర్, లలిత చిన్నప్పటినుండి అన్నా చెల్లెళ్లలాగ ఎంతో అన్యోన్యంగా వుండేవారు. ఒకే స్కూల్లో చదువుకున్నారు. శంకర్ యింటర్ ప్యాసయి M B B S. చదవడానికి వైజాగ్ వెళ్లిపోయాడు. లలిత యింటర్‌లో తప్పింది. పెళ్లివయసు వచ్చిందని చదువు మానిపించేసి కృష్ణకిచ్చి -వివాహం చేశారు. తర్వాత విడిపోయినా ఉత్తర ప్రత్యుత్తరాలు మాత్రం జరుగుతూనే వున్నాయి.

ఇంక కోకిల, కృష్ణల సంగతి. వీరిద్దరూ కూడా చాలా స్నేహంగా వుంటూ స్కూలు ఫైనలువరకూ చదువుకున్నారు. తల్లిదండ్రులు కృష్ణకి లలితనిచ్చి పెళ్ళి చేశారు. కోకిల నర్సరీ ట్రయినింగ్‌కి వెళ్ళిపోయింది. యిద్దరూ దగ్గరలేకపోయేసరికి చాలా బాధపడ్డారు.

♦ ♦ ♦

నెలరోజులు గడిచాయి. మళ్ళీ లలిత పేర శంకర్ వుత్తరం వ్రాశాడు, 'వచ్చే సోమవారం తన పెళ్లి అని, తప్పకుండా రావలెనని' లలిత చాల సంతోషించింది, కాని, స్నేహితుని పెళ్లికి వెళ్తానంటే భర్త ఒప్పుకుంటాడా మరి! భోజనాల టైయిం మయింది. భోంచేస్తూ కృష్ణ యిలా అన్నాడు: .

''నా చిన్నప్పటి స్నేహితురాలి పెళ్లికి వెళ్తున్నా''

''ఎపుడు పెళ్లి ?''

''సోమవారం రాత్రి'' అమ్మయ్యా! తన స్నేహితుడి పెళ్ళికూడా ఆ రోజే. యిద్దరికీ సరిపోతుంది అనుకుంది.

''అయితే రెండుమూడు రోజులముందుగానే వెళ్లాలి. పాపం చిన్నప్పటి స్నేహితురాలు కదా మరి'' అంది లలిత.

"ఆ దిగులు నీకెందుకు.'' అన్నాడు కృష్ణ.

♦ ♦ ♦

ఆదివారం వచ్చింది. రేపే పెళ్ళి ఎలా వెళ్లేది అని ఆలోచిస్తోంది.

"ఏమండీ! మీ స్నేహితురాలికి ప్రజంటు ఏం యిస్తారు''

''నేనా ....ఏదీ . .ఏదో యిద్దామనే వుంది కానీ . .''

''కానీ ఏమిటండీ ఒక నైలాన్ చీర''

''ఛ......''

''బండార్లంక నేత చీర''

''ఛ......ఛ నీ కేమైనా మతిగాని పోయిందా!''

"మరింకేం కొంటారు. బెంగుళూరు సిల్కు చీర"

"ఆ! అద్దది - అది చాల బాగుంటుంది. నీ ఆలోచన రాజుగారి దగ్గర మంత్రి ఆలోచనలా వుంది."

"నాకు కొనిపెట్టమంటే చేతులాడవ్ కాని ఎవరికో..."

"ఆ!...చాలు..చాలు నీవేదాంతం యిక.."

భార్య తొందరవల్ల కృష్ణ బజారుకి వెళ్లక తప్పిందికాదు. ఆ వెనకనే లలిత వెళ్లి తన స్నేహితుడికి ఓ గాబర్డీన్ సూట్ కొని భర్తకన్నముందే వచ్చింది ఇంటికి. కృష్ణ భోంచేసి సిద్ధంగావున్న రైలెక్కి వెళ్ళిపోయాడు. తర్వాత లలిత నోట్లో నాల్గు మెతుకులు కుక్కుకుని ఆ బండికే చేరుకుంది.

♦ ♦ ♦

వారి వారి స్నేహితులను నవ్వించి, కవ్వించి ఆనందంతో ముంచారు. ముహూర్తం టయిమయింది. ఆడవాళ్లందరూ సిల్కు చీరలతోటి ఫ్లోర సెంటు దీపాలముందు మెరసిపోతున్నారు. నవ యువకులు యిదేసమయమని, వయసు వచ్చిన ఆడపిల్లల వెంబడి వెళ్లి కొంగు తగిలేసరికి అంతోయింతో సంబరపడుతున్నారు. మధ్యవర్తులు కూర్చుని కట్నాల గురించి చర్చించుకుంటున్నారు. ఆడపిల్లలున్న తల్లిదండ్రులు తన కూతురికి ఏ పిల్లవాడు నచ్చుతాడో అని తేరి పార చూచేవారు, చూడండి ఒక పెళ్లి జరుగుతోంది అంటే యింకో నూతన దంపతులు సిద్ధపడిపోతారు. యింకో నాల్గు రోజులకే పెళ్లి, పురోహితుడు- ఫలానావాళ్లు చదివించారు అని ఆ బహుతులు వధూవరులకి సమర్పిస్తున్నాడు.

ఆశ్చర్యం! ఒకవైపునుండి పెళ్లికొడుకికి అని లలిత. మరియొకవైపునుండి పెళ్లికూతురికి అని కృష్ణ. ఇద్దరి చేతులు తగిలేసరికి ఒకరి మొహాలు ఒకరు చూచుకున్నారు, దిగ్భ్రాంతులయ్యారు.

యింతకీ అక్కడి వివాహం ఎవరెవరికనుకున్నారు: లలిత స్నేహితుడు శంకర్‌కి. కృష్ణ స్నేహితురాలు కోకిలకి జరిగింది. అన్నితతంగాలు అయిపోయింతరువాత యింటికి చేరుకున్నారు. ఎవరి బీరువాలలోనున్న వారి వుత్తరాలు పరుపుమీద పడేసుకుని ఒకరికొకరు చదువుకుని కడుపులు బ్రద్దలయేటట్లు నవ్వుకున్నారు.

— (౦) —

# కృత్రిమ ఎరువులవల్ల ప్రజారోగ్యం చెడుతోంది.

డా॥ ప్రకాశచంద్ర శతపథి

నేడు ప్రజల ఆరోగ్యం క్షీణించి పోతున్నది. ఎక్కడ యెవరిని చూచినా యేదో ఒక వ్యాధితో బాధపడ్తూనే వుండడం కనిపిస్తోంది. చాలామంది దగ్గుతోనో-అజీర్ణంతోనో-గుండె జబ్బుతోనో-మల బద్ధకం తోనో-సతమత మాతున్నారు. మరికొందరు యెంత తిన్నా యేమంత పుష్టిగానూ, బలంగానూ కనుపించక-ఈసురోమంటూ బక్కచిక్కిన బడుగుల్లా బ్రతుకును వెళ్లబుచ్చుతున్నారు. ఎన్ని ఔషధాలయ ములను స్థాపించి, యెందరు వైద్యులు పూనుకుంటే మాత్రం యీ ప్రజానీకం ఆరోగ్యం రక్షింపబడు తుంది? ప్రజారోగ్యం దినదినం క్షీణించడమేగాదు. భూసారంకూడా అదేపనిగా క్షయం అవుతూవున్నది. ఆహార ధాన్యాలు, కాయగూరల రుచులు ఒకేరీతిన మారిపోతూవున్నది.

వంకాయలో మునుపటి ఆ కాంతి యీనాటి ప్రజలకులేదు. నేటి పొట్లకాయను చూస్తే-అది పొట్లకాయో, యెరువుల కాయో తెలియడంలేదు.

అరటికాయకూరంటేనే అసహ్యం పుడుతోంది. కూరవండి కాస్సేపు నిలవుంచామా రబ్బరుముక్కల్లా రూపం ధరిస్తోంది.

టొమాటో రసమంటే రసనేంద్రియం యెంతో ఆరాటపడేది. ఇప్పుడా ఆరాటం కానరాదు సరికదా అసహ్యంకూడా దాపురిస్తోంది. క్యాబేజీకంటే కసవే నయమనిపిస్తోంది. దొండకాయ, బెండకాయలను వండితే డోకు వచ్చేటంతపని జరుగుతోంది. ఆఖరికి ముల్లంగి, మునగకాయలుకూడా స్వాభావికతను సుస్వరూపాన్ని గోల్పోయినవి ఎందుచా యేమాత్రం రుచీపచీ లేకుండా పోయినది. ప్రతిదానికీ ప్రతివారూ ఎరువులు వాడ్డం మరిగారు. నాణ్యతమీద దృష్టిపోయి పరిమాణం మీద కర్షకులకు మోజెక్కువైపోయినది. ప్రభుత్వంకూడా అధికోత్పత్తి పేరిట పరిమాణమునే పరిగణించి ప్రోత్సహిస్తోంది. కాని నాణ్యతన్ను విడనాడింది. ప్రతి పంటను, ప్రతిదానికీ కృత్రిమ యెరువులు వాడ్డం యెక్కువై పోతున్నది.

తోటకూరవంటి ఆకుకూరలు కూడా గైకొనడానికి అసహ్యమేస్తున్నవి. ఎందుకనా రుచీపచీ కనపడ్డం లేదు.

"తుష్టిః పుష్టిః బలం మేధా సర్వమన్నే ప్రతిష్ఠితః" అని అన్నాన్నిగూర్చి శాస్త్రం పేర్కొన్నది.

నేటి భోజనం అసంతుష్టి, నిర్బల, నిస్తేజములను నిర్వీర్యతను, చేకూరుస్తున్నది.

ఈ యెరువుల వాడకంవలన ప్రతిదాని రూపమూ, స్వాభావికతా, శక్తి, క్షీణించిపోయినవి. కృత్రిమ యెరువులు వేసి పండించబడేయీ ధాన్యాదులు, కాయగూరలు వాడుటవలన ప్రజారోగ్యం భగ్నమై నానా వ్యాధులు దాపురిస్తున్నవి. ఎరువులు కృత్రిమమైనవి వాడ్డంవలన క్రమంగా భూసారం కూడా నశిస్తోంది. ఒకసారి వేసినంత ఎరువును మరియొకసారి వేస్తే చాలడంలేదు. పంటపరిమాణం కూడా హెచ్చుకాదు. ఒకసారికంటే మరోసారి ఎరువును యెక్కువ వేయాల్సివస్తుంది. ఏదైనా ఒక సంవత్సరం యెరువు వేయలేకపోయినా, వేసినది తక్కువైనా, ఆభూమిలో ఆశించినంత ఫలసాయం పొందడం జరుగదు. ఆ భూమిలో యేదీ తగినంత పండదు. అంటే యీ కృత్రిమ యెరువులవలన భూసారం క్రమస్యా తగ్గిపోతున్నదన్నమాట. భూసారం క్షీణించి పండిన పంటలో రుచీపచీలేకపోగా, అనారోగ్యం కల్గించేవిగానుండి ధనవ్యయమౌతోంది గనక, ఈ కృత్రిమ యెరువుల వాడకం కృషీవలులు మానడం చాలా శ్రేయోదాయకము. ఈ కృత్రిమ యెరువులను యిప్పటిలాగునే యిదేవిధంగా వాడితే యింకో పాతికేండ్లలో భూములన్నీ నిస్సారమైపోతవి. కనుక కృషికులు కృత్రిమ యెరువుల వాడకం తగ్గించి, స్వాభావికములైన యెరువులను వాడుక చేయడం అలవర్చుకోవాలి. ధన సం

పాదనతో బాటు, ప్రజారోగ్యమును గూర్చి కూడా కృషీవరులు మననం చేసుకోవలసి యున్నది.

## ఎరువులు

పశువుల పేడ, పశువులు తినగా మిగిలిన గడ్డి (లేక యితర పదార్థాల్ని) యేరోజు కారోజు పశువుల దొడ్డినుండి ఊడ్చి, తీసి వేరే ఒక గొయ్యిలో వాటిని వేసి, దానిపై మన్ను కొద్దికొద్దిగా వేస్తూంటే కొద్దికాలానికి అది చాలా మంచి యెరువుగా తయారవుతుంది. దానిని కాయగూరల చెట్లకుగాని, వరి మున్నగు ధాన్యాదుల పైరుకుగాని చాలా సారవంతమయిన యెరువు. పొలాల్లో మేకల మందలను గానీ, గొర్రెల మందలను గానీ, కట్టడం మంచిది. వాటి మల మూత్రాదులు చాలా బలకరము, శ్రేష్టమయిన వీన్ని. చెరువులలోనూ, నదులలోనూ గల ఒండ్రు మట్టిని పొలాల్లో వేస్తే కూడా మంచి యెరువే. దాని వలన భూములు సారవంతములై బాగా ఫలసాయం వచ్చును. వీటిని యిప్పటికీ కొన్ని తావుల్లో వాడుతున్నారు.

పచ్చి ఆకులు చాలా సారవంతములయిన యెరువులు. పచ్చి ఆకు తెచ్చి ఒక గోతిలో వేసి, పైన మన్ను కప్పి, మూడు మాసములు పోయిన వెనుక దానిని తీసి పొలాల్లో వేస్తే, భూమి చాలా సారవంతమయినదవుతుంది. పంటలు బాగా పండుతాయి. మన దొడ్లలో చిన్న మోతాదులో కూరగాయ ఫల పుష్పజాతుల మొక్కలు పెంచుతుంటాము. వాటికి ధనియాల కషాయంగాచి మొక్కలకు వేస్తే మొక్కలు బాగా పెరుగుతవి. ఫలసాయమూ బాగా వస్తుంది. ఇది ఫలజాతులకు పుష్పజాతులకు కూడా చాలా మంచిది. ఏపుగా పెరుగనిస్తుంది. కాపును పెంచుతుంది.

ఒకవంతు ధనియాలకు పదునారు రెట్ల నీరుపోసి, సగప్రమాణమునకు కాచి దించి, చల్లారనిచ్చి, చెట్లకు వేయవలెను. యవలు, మినుములు, పెసలు, నానవేసి, ఆ నీటితోనే రుబ్బి దానిని వేస్తే ఫలజాతులకు, పుష్పజాతులకు మంచి యెరువు. గొర్రెపెంట, కాకి పెంట, యవలపిండి వేస్తే ఫల పుష్పజాతులు యేపుగా పెరిగి మంచి కాపు నిస్తుంది. గోమాంసం కూడా మట్టితో కలిపివేస్తే మంచి ఎరువు అవుతుంది. గులాబీలకిది చాలా మంచి యెరువు.

## మామిడికి

చింతగింజల పొడిని చెరుకు రసంతో కలిపి మామిడి చెట్టుకు వారమున కొకసారిగాని, రెండుసార్లుగానీ, వేసిన చెట్లు బాగా పెరిగి మంచి పండ్లు కాస్తుంది.

కొబ్బరి నీరు వారమున కొకసారి మామిడి చెట్లకు వేసిన చాలా మంచిది. చెట్లు యేపుగా పెరుగుటయే గాక, పండ్లు రుచిగా పెంపొందును. చేపల కడుగు నీరు ముఖ్యముగా రొయ్యల కడుగునీరు మామిడికి మంచి యెరువు. ఇది పుష్పజాతులకు కూడా మంచి యెరువే; గులాబీకి మరీ మంచిది.

వేపాకు, గన్నేరు, పిల్లిపీచర (శతావరి) ఎర్రచందనం వీటి ఆకునుగాని, లేక పొడినిగాని చెట్టు మొదలున ధూపము వేసినచో మామిడి తెగుళ్లు పోవును. పురుగు పుట్టదు.

## కాయగూరల చెట్లకు

కొబ్బరినీరు, తేనె, వేయుచున్న చెట్లు బాగుగా పెరిగి యెక్కువ ఫలసాయము వచ్చును. వంగ, టుమాటో, బెండ, దొండ, చిక్కుడు, కాకర సొరకాయ, గుమ్మడి, క్యాబేజీ, చిక్కుడు మున్నగు వాటికి చాలా మంచి ఎరువు. పోకచెట్లకు మరీ మంచిది.

## ఎండిపోతున్న చెట్లకు

ధనియాలు బాగా కషాయముగాచి, అందు తగు మాత్రము ఆవాలు పోకచెక్కలపొడి (కిళ్లీలలో వేసుకొనే వక్క) కలిపి-యెండిపోయి చావనున్న చెట్ల మొదట్లో వేసిన చెట్లు చిగుర్చును. బాగుగా పెరుగును.

### మామిడి కాపుకు

మేకలు, గేదెలు, ఆవులు, వీటి మావిని నీళ్ళలో వేసి, ఆ నీటిని మామిడి చెట్లపై చల్లిన మామిడి తెగ కాయును.

### దానిమ్మ చెట్లకు

మామిడిపండ్ల రసము, రక్తము (యే జంతువు దయిననూ సరియే) దానిమ్మ చెట్లకు మంచి ఎరువు. చెట్టు బాగా యెదిగి కాయును.

### కొబ్బరి చెట్లకు

మాంసమును కొద్దిగా నేతిలో వేయించిగాని లేక నేతితో కలిపిగాని కొబ్బరి చెట్లకు వేసిన కొబ్బరి అమితముగా కాయును. రొయ్యచేపలు నీళ్ళలో ఉడికించి, కొబ్బరి చెట్టుకు వేసిన బాగా కాయును.

యష్టిమధుకం (మూలికలు విక్రయించే అంగళ్ళలో దొరకును) నీళ్లలో నానవేసి, దానిని 'రుబ్బి' వేసిన కొబ్బరి మిక్కుటముగా కాయును.

### జాజి, గులాబి, మల్లె, మొదలగు పుష్ప జాతులకు

యష్టిమధుకం పొడిచేసి యీ చెట్లకు వేసిన బాగా పెరుగును. అమితముగా పూయును.

గొర్రెపెంట, మేకపెంట, వీటికి చాలా మంచిది. గోమాంసము, మన్ను కలిపి వేసిన బాగా పూయును. పాము కుబుసం పొగ వేసిన చెట్లకు చాలా మంచిది. తాబేటి మాంసం—గులాబి, సంపెంగ, జాజి, మల్లెలకు చాలా మంచి యెరువు.

### ధాన్యవృద్ధికి

గ్రంధి తగరం (మూలికల అంగళ్ళలో దొరకును) పొడిచేసి, ఆ పొడిని పరిపాలములో జల్లిన—తెగుళ్లు పురుగు నశించును. ధాన్యవృద్ధియగును.

ఫలవృక్షముల క్రింద రోజూ కొద్దిసేపు నాట్యము చేసినను, సంగీతము పాడిననూ ఫలవృక్షములు బాగుగా పెరిగి బాగా కాపు నిచ్చును. చెట్లకు యిది చాలా గొప్ప ఎరువు.

# ఆమె వెళ్లిపోయిండి

శ్రీ ఉదయగిరి ప్రభంజనం

...—...

ఆమె వెళ్లి పోయిండి
ఏమిలేనిచోట
విత్తు నాటించి
మొక్క పెరిగించి
పువ్వు పూయించి
పిందె వేయించక—
ఆమె వెళ్ళిపోయింది
బుజ్జి పువ్వులాగుండి
ముద్ద పువ్వులాగయ్యి
జీడకొమ్మలాగుండి
నీడ కొమ్మ లాగయ్యి
పచ్చటి నుదురుపైన
దోసగింజ చుక్కబెట్టి
తమ్మిపువ్వున దాగి
సీత కోకిలాగుండి
తుమ్మెద రెక్కల్లాగ
కనురెప్పలు చూపించి
కనుబొమ్మలు కదిలించి
పెదవులు మెరిపించి
సమ్మనిపించి
గుమ్మనిపించి—ఆమె

దువ్వించి
నన్ను
కవ్వించి
నవ్వించి
మనసు
మురిపించి
తనువు
మరిపించి — ఆమె
వలపు
కురిపించి
ఆశ
రేపించి
గుండె
రాపించి
ఉడికించి
ఏడ్పించి
కార్పించి
చేతికందకుండా
మూతి కందకుండా
చూపుల కందీ
నా తాపము పెంచి — ఆమె

———

# అభాగ్యులు

మాతృక :
'ప్రసాద్'

అనుసరణ :
"హ్లాదయిని"

(గత సంచిక తరువాయి)

'నీవిటనుండి పో' అని అక్బరు ఆజ్ఞాపించెను. సెలవయినంతనే అలసిపోయిన నూరీ చెంతనున్న చలువరాతిగదిలో ప్రవేశించెను. తీవ్రనృత్య క్రీడాజనితాయాసముచే నామె ఒడలు విరుచుకొనుచుండెను—ఆకస్మికముగా యాకూబువచ్చి యామెను తన బాహుపంజరమున నిరికించుకొని 'నూరీ! నేను నీ ప్రేమను తిరిగి యిచ్చివేయుటకు వచ్చితిని' అని అనెను.

వ్యాకులపాటుతో నూరీ యిట్లనెను—'వద్దు, వద్దు అలా చేయకండి!'

'నేను నేడు చంపుటయో, చచ్చుటయో తేల్చుకొనెదను.'

'అట్లయిన, మీ రిపుడు మఱల ఆ పని చేయుటకై...'

'అవును, నూరీ!'

'వద్దు, శాహజాదాయాకూబ్! ఆ పని వద్దు! నేడు నాకు సామ్రాట్టు కాశ్మీరుపోవ ననుజ్ఞయిచ్చినారు. నేను నీతోపాటు రాగలను.'

'కాని నేనక్కడకు పోవుట లేదు. నూరీ! నీవు నన్ను మఱచిపో.'

నూరీ యాతనిని తన బాహువులచే బంధించెను. కాని యాకూబును మాతృదేశాభిమానము వేగిరపెట్టసాగెను. 'నూరీ! అక్బరు తలవంచినంత మాత్రాన ఒప్పుకొనకు సరిగదా, వంగిన తలపైఎక్కి కూర్చుండ గోరువాడాతడు. మఱి నాకు సెలవు. నా ప్రేయసివైన నిన్ను స్మరించుచు స్వాహా అయ్యెదను—' అని యాకూబు పల్కెను.

నూరీ వెక్కి వెక్కి యేడ్వదొడగెను. యాకూబు భుజము ఆమె యశ్రుధారచే తడిసిపోవుచుండెను. కఠోరభావ పరంపరోన్మత్తుడయిన యా విప్లవయువకుడు, యాకూబు బలపూర్వకముగా నా రమణి బాహుపాశమునుండి తన్ను తప్పించుకొనెనో లేదో నల్గురు తాతారీదాసులా భవనాంధకారమునుండి వెలికివచ్చి యిద్దఱిని బంధించివైచిరి.

ఎదుట మూలధనము, చేతిలో పాచికలు కల్గిన అక్బరు సమ్ముఖమునకు అపరాధు లిద్దరు ప్రవేశపెట్టబడిరి. అక్బరాశ్చర్యముతో అరచెను 'యాకూబ్ఖానా!' యాకూబు వంచిన తలతో సంకుచితుడగుచుండెను. వాతావరణము నిశ్శబ్దముగా నుండెను. అక్బరు నూరీవైపుచూచి, 'ఇందుకా నీవు కాశ్మీరు పోవుటకు సెలవు కోరినది!' అని అడిగెను.

ఆమెయు మౌనము దాల్చెను.

'యాకూబ్! నీయీ బాల్యచేష్ట నక్కడ యూసుఫ్ఖాను కూడ సహింపడు. కాని నిన్ను నేను వదలివేయుచున్నాను. ఇటనుండి వెళ్ళిపోవుటకు సంసిద్ధడవు కమ్ము. నేను కాబూలు మీదుగా కాశ్మీరు వత్తును.'

ప్రభుసంజ్ఞను గ్రహించి తాతారీలు యాకూబును దీసికొనిపోయిరి. నూరీ నిలబడియుండెను. అక్బరామెవైపుచూచి, 'దీనిని బురుజునకు తీసికొని పొండి.' అని పల్కెను.

నూరీ బురుజు భూగృహములో బంధింపబడెను.

4

పదునెనిమిది యేండ్ల పిమ్మట!

వైభవోపేతమయిన తన నవరత్నములున్న సభ యెడారి యయినది. తన ప్రతాపజ్యోతి భవిష్యదంతిమ దివసపుటుదాసీన — అస్పష్టచ్ఛాయలలో విలీనమగుచుండెను. హిందూముస్లిముల ఐకమత్యోత్సాహము సన్నగిల్లుచుండెను. అక్బరునకు తన పుత్రుడయిన సలీము వలననే భయముప్పతిల్లెను. తండ్రి బ్రతికుండగనే సలీము తన్ను రాజుగా ప్రకటించుకొనెను. పితా పుత్రులకు సంధిజరిగినది. సలీమునకు ఆగ్రాలో నుండుటకు తావు లేదయ్యెను. దుఃఖితుడయి యాతడు తన జన్మభూమిలో నుండుట కనుజ్ఞ బొందెను.

సలీము ఫతేపూరుసిక్రీ చేరెను. సిక్రీమహలు మొగలు సామ్రాజ్యపుటలౌకిక ఇంద్రజాలము! అక్బరు యొక్క యౌవన పారవశ్యహేను స్వప్నము! అట్టి సిక్రీమహలు శిలాఖండములపై విక్షిప్తమై పడియుండెను. ఏమి యాకస్మికోన్నతి పతనములు! ఇక్కడేనా వసుధైక మతోద్భవనసూచన జరిగినది! ఇక్కడేనా ఆ మతావేశయుగములో నొక కప్పుక్రిందనే క్రైస్తవ, పార్శీ, జైన, ఇస్లాము, హిందూ మతాది సూత్ర చర్చలు జరుగుచుండెడివి! ఇక్కడేనా సాధు సలీము సమాధి యున్నది. ఇక్కడేగా యువరాజు సలీము జన్మించినది. అట్టి యీ సిక్రీమహలు శిథిలమై తన్నిర్మాతృకాలముననే నిర్వాసిత సుందరివోలె దయాభిక్షార్థమై, శృంగార విహీనమై శోషితమై పడియుండెను. కాని యిపుడింకను అక్బరుశూన్యశయనాగారములో విక్రమాదిత్యుని నవరత్నములు ఛాయా రూపమున తమ పూర్ణాభినయమును జూపుచుండెను. ఇపుడింకను సత్రమునకు ఎవరైన యాత్రికుడు సంత సమాధి దర్శనార్థము వచ్చిపోవుచుండెను. ఇంకను బురుజుల భూగృహములలో బంధితులు లేకపోలేదు!

సిక్రీదశ చూచి సలీము హృదయము వ్యథితమయ్యెను. అపూర్ణ శిల్పములు రోదించుచున్నట్లుండెను. పడిపోయిన బురుజులు కాళ్ళక్రింద కదలుచుండెను. తన తల్లిమహలులోనికి వెళ్ళి సలీము బిగ్గరగా నేడ్చెను. అచట ఉండిపోయిన కొలదిమంది దాసదాసీలు, తనిఖీదారులు బిచ్చగాళ్ళవలె చినిగిన బట్టలతో నతని యెదుటికివచ్చిరి. వారందరు సమాధి భోజనశాలనుండి భోజనమును పొందుచుండిరి. సలీము సమాధిని దర్శించి భూగృహములందలి బంధితులనందఱ విముక్తులచేయ నాజ్ఞాపించెను. అక్కడ రాజకీయ బంధితులెవరును నుండరని యాతని కెఱుక. దుర్గంధలిప్తమైన యెందరో కళేబరమాత్రులు ప్రసన్నులై సంతసముస సలీము సమాధికి పరవళ్లు ద్రొక్కుచు వందనమర్పించిరి. యువరాజు సలీము చరణముల ముద్దిడుకొనిరి.

నూరీ వారిలో నొకతె. ఆమె జవ్వనము కారాగారవాస కష్టములతో శోషితమయిపోయెను. ఆమె సౌందర్యము ఏవో ఒకటి రెండు స్మృతిచిహ్న రేఖలను వదలి కాలవిహంగముయొక్క రెక్కలపైనెక్కి యెగిరిపోయెను.

ఆమె అక్కడివారందరికి భోజన మందించునదయ్యెను. భోజనశాల క్రొత్తరీతిలో నడుపబడుచుండెను. సత్రమునకు వచ్చినవారికి అందుండి భోజనమిడుపని నూరీదే.

వైశాఖచంద్రిక. సర స్తీరమున పొగడచెట్టుక్రింద కొవాలీగాయకులు సమావేశమయిరి. వారు తన్మయత్వముతో పాడు పాటలలోని భావము లివి:

'నేను నా ప్రియతముని దర్శించితిని.'

'అతని సౌందర్యము ఆనందంతో పరవశత్వము కలిగించును, జ్యోత్స్న వలె నుజ్జ్వలమయినది. తరంగములవలె తారుణ్యపూర్ణము, అతని దరహాసమువలెనే సరళమయినది.

"కాని యతని యపాంగధార హాలాహల భరితము! ఎంత నిర్దయుడు!

"జీవనమరణముల రహస్యము లాచిహ్నములలో దాగియుండెను!"

"ఇపుడును నేనతనిని మఱచిపోవుట కసమర్థురాలనే!"

"కుంజములలో, పూగుబురులలో నీవు దాగుండగలవా? నీ సదా వికాసమీయ సౌందర్యము! దిగంత

వ్యాపియగు తిదాకర్షణము! నిన్ను ఓరులకంటబడకుండ జేయునా?"

"నా క్షోభను జూచి వినోదించువాఁడా, చూడు నీ పరిత్యక్తను?"

నూరీ యక్కడే నిలువబడి వినుచుండెను. ఆమె గాయకులకై భోజనము తెచ్చెను. ముతక పైజామా. పోటు చొక్కాయి. పైన నొక మొద్దుదుప్పటి. ఉదాసీన దయనీయవదనముపైన నిశ్చింతాపూర్వకమయిన శాంతి! నూరీలో నెంత విచిత్రపరివర్తనము! ఆమె హృదయము విధిలేని పరాధీనత ననుభవించుచు అశ్వాసితమయ్యెను. భగవంతుని కృపావలంబియయ్యెను. సాధుసలీము దగ్గర కూర్చుండి సర్వేశ్వరుని ప్రార్థించునపుడు ఆమె హృదయములో నైహిక వాసనగాని — అభావాభియోగముగాని మచ్చునకైన నుండవు.

నేఁడేలకో యా సంగీత మామె నిద్రాణమయిన మనో ప్రవృత్తిని జాగ్రత చేసెను. అదే పొగడ చెట్టు. ఆ గీతములందలి భావములే యజ్ఞాతలోక పరమావధి నతిక్రమించినవోగాని, నేఁడు నూరీకి నాటి సంకేత స్థలమును-సంఘటనమును-ఒక సుందరయువకుఁడు తన హృద్గతరహస్యముల విప్పిచెప్పుట—స్మరణకు వచ్చెను.

ఆ కాశ్మీరు శాహజాదా నేఁడెక్కడ నున్నాఁడో! నూరీ చంచల చిత్తముతో అక్కడే భోజన పాత్రముల నుంచి—తన యుద్రిక్త హృదయము నదిమిపట్టుకొని మెల్లమెల్లగా సలీము సమాధివైపు అడుగులిడెను.

ఆమె చలువరాతిగోడ నానుకొని కూర్చుండెను. ఎదుట చందురుని చల్లని కిరణముల వెన్నెలలో ఆమె ధ్యానమగ్న యయ్యెను. ఆమె నిశ్చల తన్మయత్వమును 'నూరీ ఇంకను సత్రములోకి భోజనము చేరలేదా?' అను పిలుపుతో నెవరో భంగపర్చిరి.

ఆమె సావధానయై నిలువబడెను. భోజనశాల నుండి రొట్టెల పాత్రల తీసికొని సత్రమువైపు నడచెను. సత్రప్రాంగణమును జేరి నిరాశ్రితుల-క్షుత్పిపాసితుల కొక్కొక్కరికి రొట్టెల నీయసాగెను.

ఒక గదిని సమీపించగా నచట నొక వ్యక్తి విరిగిన మంచముపై మూలుగుచుండుట యామెకు కానవచ్చెను. "ఏమిటన్నా! నీవు జబ్బుగా నున్నావా - నీకేమి కావలెనో చెప్పు"—అని నూరీ వాని నడిగెను.

"ఆఁ కావలెను"—అని శుష్క స్వరముతో నాతఁడు బదులు పల్కెను.

నూరీ లోనికి వెళ్ళి "ఏమిటి చెప్పు" అని అడిగెను.

"నేనొక దిక్కుమాలినవాడను. ప్రొద్దుననుండి పచ్చినీళ్లు దొరకలేదు. లేచుటకైన వీలు కాకుండ కాళ్లు నొప్పి పుడుచున్నవి."

"అయ్యో పాపము!"

"నిన్న రాత్రి యిటకు చేరి కొంచె మేదో యెంగిలి పడ్డాను. నడచి నడచి కాళ్లు వాచిపోయినవి. అప్పటి నుండీలా పడియున్నాను."

నూరీ పాత్ర నచటనుంచి బయటికి వెళ్ళి నీరుతెచ్చి "ఇఁక లేచి యీ రొట్టెలు తిని, యీ నీరు త్రాగు" మని యడిగెను.

ఆ మానవుడు లేచి కూర్చుండెను. రొట్టె, నీరు కడుపులోనికి జారి కొంత సత్తువ వచ్చెను. పిమ్మటతఁడు—"నీ వెవరవు?"

"నే నిట రొట్టె లిచ్చుదానను. నా పేరు నూరీ. నీ బాధ తగ్గిపోవువరకు నేను నీకు పరిచర్య చేయుచుందును. రొట్టె నీళ్లు నీకిచ్చెదను. గాబరాపడకు. ఇచట యజమాని అందరను చల్లగా జూచును."

ఆ మనుష్యుని వివర్ణనయనములు ప్రార్థనాపూర్వకముగా పైకి జూచెను. ఒక దీర్ఘనిశ్వాసముతో నాతఁడిట్లడిగెను- "నీ పేరేమన్నావు. నూరీయా?"

'ఆఁ అదే!'

'అయితే నీవీమహలులలో తిరుగుచుందువుగదా?'

'మహలులా! అవును మహలుల గోడలు నిల బడియే యున్నవి.'

"నీకు తెలియునా, ఆమె పేరుకూడ నూరీయే! ఆమె కాశ్మీరు కన్య."

'ఆమెతో మీ కేమిపని' యున్నది. కంపితస్వర ములో నూరీ ప్రశ్నించెను.

'నీ కామె కనుపించినచో చెప్పు. పూర్వ మొక యభాగ్యుడు నీ ప్రేమను తిరస్కరించినాఁడు. అతఁ డపుడు కాశ్మీరు శాహజాదా, యిపుడు బిచ్చగాని కంటె...' అని పల్కుచుండగానే వాని కన్నులనుండి యశ్రుబిందువులు దొరల దొడగెను.

నూరీ యాతని కన్నీటిని తుడిచి "ఇపుడామెను కలిసికొనవలెనని నీకిచ్చగా నున్నదా?" అని అడిగెను.

అతఁడు బాలునివలె నేడ్చి యిట్లు చెప్పదొడఁగెను 'నా పేరు యాకూబుఖాను. నే నక్బరుపై కత్తి గట్టి నాను. పోరాడినాను. చేయగలిగినదంతయు చేసి నాను—ఎందుకు, నా కాశ్మీరు కోసము. అందుకు బీహారు భయానక భూగృహములో సంకెళ్లతో బంధింపబడి యెన్ని దినాలందు పడియున్నానో! సుల్తాను సలీము అక్కడి మందభాగ్యులను తిరిగి ఎండ మొగము చూచుటకు వదలిపెట్టిన వార్త నీవు విని యుండవచ్చు. నే నక్కడనుండే పడుచు పడుచు వచ్చితిని. సంకెళ్లు వీడిపోయిన తర్వాత నన్ను ప్రేమించినవారిని చూడ మనసయినది. అందుకనియే యీ సిక్రీవచ్చి చేసినాను. చూడగా, ఆమె నాకు లభించునట్లు లేదు.'

యాకూబు చెల్లుబుకి వచ్చుచున్న కన్నీటిని తుడుచు కొన సాగెను నూరీ మనస్సులో గతించిన ఆ సంఘ టనము, తన ప్రేమ సమర్పణోత్సాహము ఆ మనస్వి యువతిని తిరస్కారము అన్నియు నిపుడే జరిగి నట్లుండెను

కాని నేటి జీవితస్వరూపము! ఆశాభరిత సంసార యాత్ర యే రమణీయ విశ్రామ భవనమున ఆగునో! ఇంతవరకు జగత్తులోని యెన్ని రమణీయ రహస్య ములు పూరెమ్మలవలె విచ్చినవో! ఇక ప్రేమించు రోజులు పోయినవి. ఈ మోడు మరల చిగుర్చుటకు కావలసిన స్నేహము నా హృదయమునందేది?— ఇత్యాది భావపరంపరలతో నూరీ మనసు త్రొక్కిస లాడెను. తుదకు నూరీ మోహజాలమును త్రెంచివేయ గల్గెను. ఇఁక నామె దానిలో బడదు. కాని యీ దయనీయ మానవుని పరిచర్య? ఇది యెట్లు?

యాకూబునకు ఎక్కిళ్లు వచ్చుచుండెను. అతని ప్రశ్నకు సంతోషదాయకమయిన ప్రత్యుత్తరము లభింపలేదు. కఠినహృదయినియైన నూరీ ఆలసించెను. ఆమె యింకను ఆలోచించుచుండెను. ఇంతలోనిట యాకూబునకు కాలము పరిసమాప్తమయ్యెను.

# సుఖమెక్కడ?

శ్రీ మరువాడ సూర్యప్రకాశం



సుఖమెక్కడ ఓ సఖులారా ?
సుఖమే లేదిక సఖియల్లారా !

నిద్రమంచమున లేచినదాదిగ
మండుటెండలో మలమలమాడిన
కొండలు దొలిచే కష్టజీవులకు ||సుఖ||

కోడికూతవిని మేలుకొన్నదొర
మేడిపట్టుకొని మడిలోదున్నిన
కూడు చేరుటకు తీరికయుండదు ||సుఖ||

వేగుజుక్కతో నిదుర మేలుకొని
ఇంటి గుమ్మములు ఈనెలుదిద్దిన
ఇంటిపనులలో ఈదెడు గృహిణికి ||సుఖ||

రేయింబవల్లు తేడాలేక
ఎండవానల భేదములేక
ఆకలిదప్పుల నరిగట్టుకొని
నిలుచునపాటున నిదిరించెడు
రెక్కలుయాడెడు రిక్షావానికి ||సుఖ||

అప్పులవారు అడుగుచుండగా
ఉప్పులేదని ఇల్లాల్ జెప్పగ
పప్పుకూడుకే కఱవై పోవగ
కుటుంబభారము కృంగతీయగా
కన్నకూతులకు కల్యాణములకును
ఉన్నదికాస్తా ఊడిపోవగా
గుట్టుగాను జీవించు గృహస్థుకు ||సుఖ||

—X—

# సోవియట్ దేశం వయోజనులలో నిరక్షరాస్యతను ఎలా తొలిగించింది?

శ్రీ ఎ. సొలొవ్యేవ్

---

సోవియట్ ప్రభుత్వానికి జారు ప్రభుత్వంనుండి సంక్రమించిన అనర్థాలలో వయోజనుల విస్తృతంగా ఉండిన నిరక్షరాస్యత ఒకటి. విప్లవం జరిగినప్పటికి ప్రజానీకంలో చదవడం, వ్రాయడం వచ్చినవారు నూటికి ముప్పైకి మించి ఉండేవారుకారు. మధ్య ఆసియా, కజఖస్తాన్, మరికొన్ని రష్యన్ సరిహద్దు ప్రాంతాలలో దాదాపు యావత్తు జనాభా నిరక్షరాస్యులుగా ఉండేవారు. అనేక జాతులవారి భాషలకు స్వంత లిపి ఉండేదేకాదు. బడికి వెళ్ళే వయస్సుగల బాలబాలికల్లో మూడవవంతు మాత్రమే ప్రాథమిక పాఠశాలలకు హాజరయ్యేవారు. అందువల్ల సోవియట్ ప్రభుత్వం స్థాపితమవడంతోటే వయోజనులలోను, పెరిగిన పిల్లలోను విస్తృతంగా ఉండిన నిరక్షరాస్యతను, అర్థ-అక్షరాస్యతను తొలగించడం ఒక ప్రధాన సమస్యగా పరిణమించింది.

జారుప్రభుత్వం సంక్రమింపజేసిన నిరక్షరాస్యతను అర్థ-అక్షరాస్యతను శాశ్వతంగా అంతమొందించడానికి ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంపొందించడానికీ, విస్తారంగా ఉన్న శ్రమిక ప్రజానీకాన్ని దేశ సాంఘిక, రాజకీయ జీవితంలోకి తీసుకురావడానికీ సోవియట్ ప్రభుత్వం దేశవ్యాపితంగా తక్షణ చర్యలను గైకొనవలసివచ్చింది.

1919 లో లెనిన్ దేశంలో నిరక్షరాస్యతను అంతమొందించడానికి సంబంధించిన ఒక అధికార ప్రకటనను చేసారు. చదువురాని 8 సంవత్సరాలనుండి 50 సంవత్సరాలమధ్య వయస్సులో నున్నవారందరికి వారి జాతీయ భాషలోగాని, లేక రష్యన్ భాషలోగాని చదువు నేర్పబడాలని ఆ ప్రకటన ఆదేశించింది. ఈ ప్రకటన యావన్మంది ప్రజలదృష్టికి తేబడింది. ప్రభుత్వం తీసుకొంటున్న అత్యుత్తమ చర్యగా అది ప్రజలచేత ఏకగ్రీవంగా ఆమోదింపబడింది.

నిరక్షరాస్యతను అంతమొందించే పనిని నడుపుటకు కేంద్రంలో అఖిల రష్యన్ కమీషన్ ఒకటి, స్థానికంగా వేరే కమీషన్లు యేర్పాటు చేయబడ్డాయి. వాటిలో ముఖ్యులైన ప్రభుత్వ కార్యకర్తలు, ప్రజాసంస్థల ప్రతినిధులు ఉంటుండేవారు. "నిరక్షరాస్యత నశించుగాక" అనే సంఘం ఒకటి స్థాపింపబడ్డది. కార్మికులు, రైతులు, కార్యాలయోద్యోగులు, విజ్ఞానశాస్త్రవేత్తలు ఈ సంఘంలో చేరారు. అర్థ-అక్షరాస్యుల కొరకు పోస్టర్లను, బోధకసాధనాలను, పాఠ్యగ్రంథాలను, మేగజైన్లను, వార్తాపత్రికలను ప్రచురించడానికి ఒక ప్రత్యేక ప్రచురణాలయం స్థాపింపబడ్డది.

నిరక్షరాస్యతను అంతమొందించడానికి అనేకమంది ఉపాధ్యాయులు అవసరమయ్యారు. ఎందుకంటే లక్షలకొలది ప్రజలకు విద్య నేర్పవలసిన పని పడింది. శిక్షణ పొందిన ఉపాధ్యాయులచేత మాత్రమే సాధ్యమయ్యేదీపని. దేశంలోని విద్యావంతులైన ప్రజలందర్నీ—ఇంజినీర్లు, ఉన్నత తరగతుల విద్యార్థులు పాఠశాలల విద్యార్థులు, కార్యాలయోద్యోగులు విద్యావంతులైన కార్మికులు, రైతులు మొదలైన వారందర్నీ—సమీకరించడం అవసరమయింది. ఈ పనిలో యువజన సంఘాలు ప్రముఖపాత్రను వహించాయి.

పాఠశాలల ఉపాధ్యాయులు క్రమమైన పద్ధతిని యెలా విద్యనభ్యసించాలో చెప్పేవారు. శిక్షణను పొందిన ప్రతి ఉపాధ్యాయుడు, నిరక్షరాస్యతా నిర్మూలనకు యేర్పాటుచేయబడిన అనేక పాఠశాలలలో (వీటిని "లిక్ బెజ్"లు అని పిలిచేవారు) పని చేస్తుండేవాడు. ఉపాధ్యాయులు ఆ పాఠశాలల్లో బోధనమును గావించి, నమోనా పాఠాలను చెప్పి, అవసరమైన ఇతర సలహాలను ఇస్తుండేవారు. వయోజనులందరు హాజరు కావడానికి వీలుగా ఉండేటట్లు

"లిక్ బెజ్" పాఠశాలలు యేర్పాటు చేయబడ్డాయి. ప్రభుత్వపాఠశాలలు, కార్యాలయాలలోను, క్లబ్బులలోను ఈ పాఠశాలలలో నడుస్తుండేవి. సాయంత్రం పూట పాఠాలు చెప్పబడేవి. వ్యక్తిగతంగా చదువు చెప్పడం విస్తృతంగాజరుగుతుండేది. పసిపిల్లలు ఉండి బడికి హాజరు కాలేని తల్లులు అనేకమందికి చదువు చెప్పడానికి ఉపాధ్యాయులు వాళ్ల ఇండ్లకే వెళుతుండేవారు.

నిరక్షరాస్యతను అంతమొందించడంలో మొదటి దశ నిరక్షస్యులకు 3,4 నెలల్లోపల చదవడం వ్రాయడం నేర్పడంతో కూడి ఉండేది. అటుతర్వాత వారికి వారికొరకు ప్రత్యేకంగా ప్రకటింపబడిన వార్తా పత్రికలు చదవడం నేర్పబడేది. ఈ పత్రికలు సరళమైన భాషలో చిన్న కథలను, సూక్ష్మంగా దేశీయ, విదేశీయ వార్తలను ప్రకటించేవి. అర్థ-అక్షరాస్యుల కొరకు ప్రత్యేకమైన పుస్తకాలు, కరపత్రాలు అధిక సంఖ్యాక ప్రతులలో ప్రచురింపబడుతుండేవి.

అటుతర్వాత రెండవ దశలో ఒక సంవత్సరం కోర్సు యేర్పాటు చేయబడేది. ఈ ఒక్క సంవత్సరం కోర్సులో మామూలు ప్రాథమిక పాఠశాలలో మొదటి రెండు తరగతులలో నేర్పబడేవిద్య నేర్పబడేది. ఆ తర్వాత మరిరెండు సంవత్సరాల కోర్సులో ప్రాథమిక పాఠశాల మొదటి నాలుగు తరగతులలో చెప్పబడేవిద్య బోధింపబడేది. బాలల పాఠశాలల్లో విద్యాబోధనచేసే ఉపాధ్యాయులే వయోజనుల ఒక సంవత్సరం, రెండు సంవత్సరాల కోర్సులను సాయంత్రపు పాఠశాలలల్లో బోధిస్తుండేవారు. అందు కొరకుగాను వారికి అదనంగా కొంత వేతనం ఇవ్వబడేది.

సార్వజనీన ప్రాథమికవిద్య (నాలుగు సంవత్సరాలు) ప్రవేశపెట్టబడిన తర్వాత దేశం మొత్తం మీద గొప్ప మార్పు వచ్చింది. అటు తర్వాత 7 సంవత్సరాలనుండి 14 సంవత్సరాల వయస్సు మధ్య ఉన్న బాలలకు సప్తవర్ష విద్య ప్రవేశపెట్టబడింది. సార్వజనీన సెకండరీ విద్యను ప్రవేశపెట్టేందుకుగాను సెకండరీ పాఠశాలలు అధికంచేయబడ్డాయి. వయోజనులకొరకు ఉన్నత విద్యాసంస్థలు శ్రమికుల ప్రవేశపరీక్షలకు తరగతులను యేర్పాటు చేసాయి. ఈ తరగతులలో కార్మికులు, రైతులు మూడు సంవత్సరాల కాలంలో సెకండరీ విద్యను పూర్తిచేసుకొని ఉన్నత పాఠశాలల్లో ప్రవేశించేవారు. అదే సమయంలో నగరాలలోను, గ్రామాలలోను సాయంత్రపు సప్తవర్ష పాఠశాలలు, సెకండరీ పాఠశాలలు ప్రారంభింపబడ్డాయి.

దేశమంతటాగల సాయంత్రపు సప్తవర్ష పాఠశాలలు, సెకెండరీ పాఠశాలలూ బాగా అధికమయ్యాయి. ఉదాహరణకు, ఈ సంవత్సరం, ఒక్క రష్యన్ సమాఖ్యలోనే 130,000 మంది కార్మికులు, రైతులు సాయంత్రపు పాఠశాలలలో ఉత్తీర్ణులయ్యారు. వీరంతా పనులు చేసుకొంటూనే విద్యాభ్యాసంచేసారు. రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కాకముందే ప్రజలలోని నిరక్షరాస్యత అంతమొందింపబడింది గాబట్టి ఇప్పుడు వయోజనులకు సాయంత్రపు సప్తవర్ష పాఠశాలలు, సెకెండరీ పాఠశాలలు, ఉత్తర ప్రత్యుత్తరాలద్వారా విద్యను నేర్పే పాఠశాలలు మాత్రమే ఉన్నాయి.

నిరక్షరాస్యతను అంతమొందించడంలో సోవియట్ ప్రభుత్వం విస్తృతంగా తీసుకొన్న చర్యలు ప్రముఖపాత్రను వహించాయి. "లిక్ బెజ్"లలో విద్య నభ్యసించినవారిలో అనేకమంది తమ విద్యను ఇంకా కొనసాగించారు. ఉన్నత విద్యాభ్యాసం చేసి తమ ప్రజలకు ప్రయోజనకరమైన కృషిలో పాల్గొంటున్నారు. వయోజనుల కొరకు యేర్పాటు చేయబడిన "లిక్ బెజ్" పాఠశాలలు, ఉన్నత విద్యాపాఠశాలలు లక్షలాది శ్రామిక ప్రజలకు విద్యాభ్యాసాన్ని కలుగజేసి, ప్రభుత్వనిర్వహణలోను, దేశ సాంఘిక జీవితంలోను చురుకుగా పాల్గొనే సదవకాశాన్ని కలుగజేసాయి.

(456-వ పేజీ తరువాయి)

చూపవచ్చు. వాళ్లూ తమ సంచారాల్లో ఇలాటి వాటిని గుర్తు పట్టటానికి ఏమాత్రం కష్టంవుండదు కూడా! ఇలాటి పనులను ఎప్పటికప్పుడే చేసుకోటం అన్ని విధాలా మంచిది'' అని తనకు ఇలాటి విషయాల్లో ఎంతో అనుభవం వున్నట్లు ఒక పోజు వేసి అన్నాడు. అంతటితో వూరకుంటేగా అబ్బాయి! ''కలుపుతీయకుండా కొన్నాళ్లు అశ్రద్ధచేశాము! అవి చేసేరణగొణధ్వని ఇంతింతని చెప్పాలా! ఒక్కసారి అలాగే జరిగిందికూడా. మాగ్రహ మండలమంతా వ్యాపించటంతో వూరుకోక, వేళ్లని చుట్టుప్రక్కల తచ్చాడుతూవున్న గ్రహమండలాలలోకికూడా లాక్కొని వచ్చాయి. దాంతో మాగ్రహమండలం గమనమే కాక, ఇతర గ్రహమండలాల గమనం కూడా అమాంతంగా స్థంభించుకుని పోయింది...'' అని అన్నాడు.

అబ్బాయి చెప్పేదంతా వింటూ ఆశ్చర్యమగ్నుడనయ్యాను. వాడి కోరికను ఆ క్షణాన్నే తీర్చాలనే వుబలాటంతో వాడు చెప్పిన వివరాలనిబట్టి ఆ ''కోతి రొట్టె''చెట్ల చిత్రాన్ని గీశాను. కలుపు మొక్కల మూలాన అసలు చెట్టురూపమే ఎలా మారిపోయి అది భూతంగా అయిపోతుందో, అలా అయిపోయిన భూతం గ్రహమండలాల గమనాన్నే అమాంతంగా ఎలా ఆపివేస్తుందో మరో చిత్రంలో స్పష్టంగా చూపాను........

ఆ రోజంతాఇలా వాడు చెబుతూవున్న రొట్టెచెట్ల సంగతులతోను, వాడి కోరికననుసరించి నేను గీసిన రకరకాల చిత్రాలతోను గడిపాము. .. ...

---

ఒక మీసాలదొర తుపాకి తీసికుని వేటకెళ్లాడు. ఒక గంట తరువాత నురుగు దబ్బలు పడేటట్లు నౌకరు పరుగెత్తుకొని వచ్చి ''అయ్యా! యిక్కడికి ఉత్తర దిక్కుగా పులి అడుగుజాడలు కనుపించాయి'' అన్నాడు ఆయాసంతో.

దొరగారు తప్పన లేచి నిలబడి ''రైటో - దక్షిణదిక్కు ఎటోయ్'' అన్నాడు మీసాలు సవరించుకుంటూ గంభీరంగా.

అల్లంకి చెల్లారాం

---

—(o)—

# విశ్వసుందరి

శ్రీ K. V. సుబ్బారావు బి. ఏ.



(జూలై సంచిక తరువాయి)

4

దైవాన్ని మనసులో తలచుకొని నూటిగా బయలుదేరాడు. ప్రయాణం చేసిచేసి చివరకు రాబందులుండే నివేశనం చేరుకున్నాడు. రాబందులరాజు యితడిని చూడగానే హుమ్మని హుంకరించి మీదకొచ్చాడు. "మీతో పోట్లాడటానికి నేను రాలేదు. రత్నాంగుళీయంవుండే మార్గం చూపించండి!" అన్నాడు నమ్రతగా. కాని రాబందురాజు భువనసుందర్ మాటలు వినిపించుకోలేదు. గభాలున రాబందురాజు భువనసుందర్‌ను ముక్కున గరచుకొని ఆకాశమార్గాన ఎగిరిపోయింది. ఇలా ఆ రాబందురాజు ఎగిరిఎగిరి చివరకు ఒక వుద్యానవనంలో దిగింది. ఎక్కడ వదిలిపెడుతుందో ఎక్కడ క్రిందపడిచస్తానో అని భయపడిపోతున్న భువనసుందర్ కొంత గుండె ధైర్యం తెచ్చుకున్నాడు. అతడిని క్రింద పెట్టింది, భువనసుందర్ చచ్చినట్లు పడివున్నాడు. రాబందు అతడిని ముక్కుతో పొడిచి చంపితినాలని ఎత్తువేస్తున్నది. ఇంతలో ఒక బాణంరివ్వుమంటూ వచ్చి రాబందు పొట్టలో దూసుకుపోయింది. రాబందు నేలకొరిగింది.

ఇంతలో గబగబా రాజకుమార్తె ఆమె చెలికత్తెలూ పరుగెత్తుకుంటూ వచ్చారు. "మాయదారి రాబందు ఇతడిని ఎత్తుకొచ్చింది కాబోలు! కొంచెం నీళ్లు తీసుకురావే. మొహంమీద చల్లుదాం" అంది.

చెలికత్తె నీళ్లు తీసుకొచ్చింది. మొహాన బాగా చిలకరించింది. తెలివి రాలేదు. ఏంచేయాలా అని సందేహం పట్టుకుంది. ముద్దుపెట్టుకుంది. చలనం కలగలేదు. ఇలా లాభంలేదనుకొని గాఢంగా కౌగలించుకొని చక్కిలిగింతలు పెట్టింది. ఆ స్పర్శతో భువనసుందర్ తెలివివచ్చి లేచికూర్చున్నాడు. సిగ్గుపడి తొలగి కూర్చుంది రాజకుమారి.

"నేనిక్కడకు ఎలావచ్చాను. ఎవరు మీరు?" అని ఆశ్చర్యపోయాడు.

"నా పేరు కలకంఠి. వీళ్లు నా చెలికత్తెలు. నేనీ వుద్యానవనంలో విలువిద్య నేర్చుకుంటున్నాను. ఇంతలో ఈ రాబందు మిమ్ములను నోట కరుచుకొని ఇక్కడ వ్రాలింది. దాన్ని బాణంతో చంపి మిమ్మల్ని విడిపించాను" అంది.

"మీ మేలు నా జన్మలో మరిచిపోలేను!" అన్నాడు కృతజ్ఞతతో.

"మీ రెక్కడికి బయలుదేరారు?" అంది రాజకుమారి.

భువనసుందర్ తాను ఎందుకు బయలుదేరింది వివరంగా చెప్పాడు.

"రత్నాంగుళీయమా! ఆ...!! నాకు గుర్తుకొచ్చింది. మా రాక్షసుని చేతివ్రేలుకుంది అదేనా?" అంది.

"ఆ! అదే! ఎవరా రాక్షసుడు?" అన్నాడు.

"ఇంకా తెలీదా? నేను ఒకసారి క్రీడామందిరంలో ఆడుకుంటుంటే నన్ను ఎత్తుకొచ్చి పెండ్లి చేసుకోమని ప్రాణం తీస్తున్నాడు. వీడి బారినుండి తప్పించుకోలేక యిలా నే ఈ బంధికానాలో పడివున్నాను. ఆ రాక్షసుడు వచ్చేవేళయింది. ఇక మీరు దాక్కోండి. లేకపోతే చంపేస్తాడు" అంది కాని మాట మాత్రంలో నరవాసన తగిలి పరుగెత్తుకుంటూవచ్చాడు. భువనసుందర్‌నుచూచి, "వీడెవడు? యింత సాహసంరా! ఇక్కడికి రావటానికి!" అంటూ వాడిని కాస్తా గుటుక్కుమనిపించి వెళ్ళిపోయాడు.

(సశేషము)

# సంపాదకీయములు

## విదేశాల ఋణసహాయము

మన జాతీయ పంచవర్ష ప్రణాళికలమలు జరుగుటకు విదేశ సహాయ సహకారములతో బాటు విదేశాల నుండి విశేషముగా ఋణము సేకరించబడుతున్నది. ఈ ఋణములను తీర్చుకోడానికి అవకాశములు, సహజ సంపదలున్నవని మన అంచనా అయినా సేకరించబడిన ఋణములు సాధ్యమైనంత త్వరలో తీర్చవలెననెడి ఆతురత ప్రభుత్వ యంత్రాంగమునకు, ప్రజలకు, ప్రజాప్రతినిధులకుండవలెను. అందుకుగాను అధికార, అనధికార సహకారముతో విదేశములనుండి సేకరించబడిన మొత్తాలు సద్వినియోగమయి సకాలములో ఋణ భారము తొలగిపోవలెను. మన జాతీయ విధానాల విశిష్టతను, వ్యక్తిత్వమును నిలబెట్టుకొనుటకు పంచవర్ష ప్రణాళికల నిర్వహణద్వారా అభివృద్ధి అభ్యుదయాలను సాధ్యమయినంత త్వరితగతిన సాధించి దేశం ఋణ విముక్తను కావలసియున్నది. లేనిచో విదేశాల ఒత్తిడికి, దోపిడికి గురికావలసిరావచ్చును.

## ధాన్యముల ధరలు

ధాన్యం ఉత్పత్తిదారుల మంటున్న భూస్వాములు ధరలు తగ్గుమొగము పట్టుటతో, నిలకడైన సరస మగు ధరలు ఏర్పడుటతో అవకాశమియనప్పుడు యు. పి. వర్తకులు చాటుమాటున నిల్వజేసిన పంజాబులోని గోధుమలను ప్రభుత్వము స్వాధీనముచేసికొన్నట్లు యితర రాష్ట్రములలోకూడ తప్పనిసరి కావలసియున్నది. ప్రజావసరాల నుద్దేశించి విదేశాలనుండి ఆహార ధాన్యములను విశేషంగా దిగుమతిచేసుకుంటూ, వ్యవసాయ దేశంగా మనదేశంలో పైరుపంటలకు అవకాశాలుండి, వ్యవసాయోత్పత్తులు తృప్తికరముగానుండి ప్రజల ఆదాయ ప్రమాణము ననుసరించి సరసమైన ధరలకు తిండిగింజలు లభించకపోవడం మన జాతికే మొత్తానికే సిగ్గుచేటు. స్థానికోత్పత్తులయిన అనేక ప్రజల జీవితావసరాల ధరలు సయితం పెరిగిపోతున్నవంటే ఉత్పత్తి దారులకు, వర్తకులకు ఉమ్మడి శ్రేయస్సుపట్ల, సౌభాగ్యముపట్ల ఆసక్తి లోపమనిచెప్పాలి. ఉత్పత్తి ఖర్చులు పెరిగితే అవి తగ్గడమునకు ఆందోళనచేసి, ప్రభుత్వ సహాయ సహకారములనుపొంది ఉత్పత్తులను పెంచాలిగాని, తమ ఖర్చుల పెరుగుదల కొద్దిపాటిదైనా దాన్ని సాకుగాచెప్పి అధిక లాభాల నుద్దేశించి ఉత్పత్తుల ధరలుపెంచి ప్రజల ఆర్థిక దుస్థితిని మరింత క్లిష్టముచేయడము సబబుకాదు.

## భాష, సంస్కృతి, కళల పరస్పర ప్రభావము

ప్రతియొక్కజాతికి సాంప్రదాయ శిద్ధమగు విశిష్టమైన కళలు, సంస్కృతి. భాష సహజముగానున్నవి వ్యక్తిగతంగా వాటి అభివృద్ధికి ఏజాతికాజాతి కృషిజరుపుతునే యుంటుంది. కాని అంతమాత్రంచేత పర స్పర ప్రభావముండదన సాహసించలేము. అట్టి ప్రభావము వ్యక్తిగతంగా కళలకు, సంస్కృతికి, భాషకు మెరుగులు దిద్దడంకలదు.

ప్రపంచములోని దేశదేశాలమధ్య సన్నిహిత సంబంధాలకు అవకాశాలు నానాటికి మెరుగగుతున్న యీ కాలంలో కళ, సంస్కృతి, భాషలపై విజాతీయ ప్రభావమేకాక విదేశముల ప్రభావమునకు సయితము

అవకాశములు మరింత విస్తృతమగుచున్నవి. ఇది ఎంతవరకు వాంఛనీయమా అనే సమస్యను పారజూచినచో అట్టి ప్రభావము ఏకళకైన. భాషకైన, సంస్కృతికైన జాతీయ విశిష్టతకు, సాంప్రదాయములకు భంగము కలుగకుండా వానికి వినియోగపడటం వాంఛనీయము. ఇందువలనవాని వ్యక్తిత్వమునకు లోపము రానేరదు.

ఈ సందర్భమున వివిధజాతీయ సంస్కృతులకు, భాషలకు, కళలకు నిలయమయిన మన దేశంలో పరస్పర ప్రభావము అనివార్యమైనది. అంతమాత్రంచేత ఉత్తరాది సంగీతము కర్ణాటక సంగీతములో ఐక్యము కావాలనిగాని, ఒక భాష మరొక భాషతోటి, ఒక సంస్కృతి మరొక సంస్కృతితోటి ఐక్యము కావలెననడంగాని వాదస్తము కాగలదు. అలాగే నాట్యము, శిల్పము, చిత్రలేఖనములు సయితము దేనికది తన వ్యక్తిత్వమును నిలుపుకుంటూ సాంప్రదాయానుగుణంగా శాస్త్రీయతను దృష్టిలో నుంచుకొని పరస్పర ప్రభావమును తమ వ్యక్తిగత అభివృద్ధి అభ్యుదాయాలకు వినియోగించుకోవాలి.

భాషలు, కళలు, సంస్కృతులు మానవ పురోభివృద్ధికి, అభ్యుదయానికి నిర్దేశించినవి. విద్యావిజ్ఞానాలను, మనోవికాసాన్ని, వినోద ఉల్లాసాలను ఉన్నత స్థాయిలో అవి సమకూర్చకలుగడం ప్రధానము.

## కేసరి విద్యాలయముల అభివృద్ధి

మద్రాసు నగరంలో - త్యాగరాయ నగరునందలి కేసరి మిడిల్‌స్కూలు హైస్కూలుగా రూపొందడంతో కేసరి విద్యాలయముల అభివృద్ధి పేర్కొనతగిన అభ్యుదయ దశలోపడ్డదని చెప్పవలసియున్నది. ఈ హైస్కూలు నిమిత్తము ప్రముఖ చలన చిత్ర నిర్మాత శ్రీ బి. నాగిరెడ్డి విరాళముతో నిర్మింపబడిన 'నాగిరెడ్డిహాలు', ప్రసిద్ధ సినిమాతార శ్రీమతి అంజలీదేవి విరాళముతో ఏర్పడిన 'లేబరటరీ' యీ హైస్కూలు రూపొందడమునకు విశేషముగా తోడ్పడినవి. కేసరి హైస్కూలుతో పాటు కాలేజిసయితం ఏర్పడ ప్రయత్నము సాగునట్లయినచో శ్రీ బి. నాగిరెడ్డిగారు మరొక రు. 25000/- విరాళమును వాగ్దానము చేయుటతో కేసరి విద్యాలయములకు మహోజ్వలమైన భవిష్యత్తుకు సూచనలు కనబడుచున్నవి. కేసరి విద్యాలయముల అభివృద్ధికేమి, ముఖ్యంగా త్యాగరాయనగరునందలి కేసరి హైస్కూలు రూపొందడానికేమి కేసరి ఎడ్యుకేషన్ సొసైటి కార్యదర్శి దివాన్ బహుదూరు బండి శ్రీ హరిరావు నాయుడుగారి పట్టుదల, నిర్విరామకృషి ప్రశంసనీయములు. విద్యాలయముల అభివృద్ధినుద్దేశించి వారు సమీకరించుచున్న సహాయసహకారములు అమూల్యములు. వారి ఆసక్తి, దీక్ష, కృషి 'కేసరి కాలేజి' నిర్మాణానికి సయితము తోడ్పడగలవని ఆశిస్తున్నాము.

మద్రాసులోని తెలుగువారే కాక, సోదరాంధ్రులు సయితము యీ విద్యాలయముల అభివృద్ధి పట్ల ఆసక్తిచూపి, మద్రాసులోని తెలుగు బాలబాలికల మాతృభాషలో విద్యావసతులకు తోడ్పగలరని ఆశిస్తున్నాము.

## మహిళాసేవా సంస్థలు

మహిళాసేవనుద్దేశించి స్థాపించబడిన సంస్థలలో గుంటూరులోని శారదానికేతనము, మద్రాసు సేవా సదనము, అవ్వైహోము, ఆంధ్రమహిళాసభలు పేర్కొన తగినవి. వాని స్థాపనకేకాక నిర్వహణకు సయితము దీక్షతో స్వార్థరహితంగా కృషి సలుపుకొనిన శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ, లేడీముత్తా వెంకటసుబ్బారావు, డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారల సేవాత్యాగాలు చిరస్థాయియైనవి. ఈ సంస్థలలో ఏ కారణాలచేతనైతే నేమి శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి మరణానంతరము శారదానికేతనము ఒడిదుడుకు

లలో పడ్డదికాని మద్రాసు సేవాసదనము, అనైవహోములు వర్ధిల్లి నిర్విరామంగా మహిళాసేవచేయుచు ఆదర్శనీయములయినందుకు అభినందించవలసియున్నది.

బాల్య వివాహములవలన వైధవ్యము ప్రాప్తించినవారిని, భర్తల అమానుష, అయోగ్య ప్రవర్తనవలన దిక్కులేకపోయినవారిని, లేక తమకు తెలిసి, తెలియని యూహాలతో, చిన్న వయస్సులో నైతికపతనము చెందిన పశ్చాత్తప్తులను అనామకంగాపుట్టిన అనాధ శిశువులను చేరదీసి విద్యాబుద్ధులు చెప్పించి, పోషించి, పతనావస్థనుండి ఉద్ధరించి, నిలకడైన జీవితవిధానమును, సౌభాగ్యమును రూపొందించుటలో మద్రాసు సేవాసదనపు కృషి అమోఘము, అమూల్యమైనదని చెప్పవలసియున్నది.

ఈ సంస్థ నిర్వహణకు, అభివృద్ధికి తమ సహాయసహకారములతో తోడ్పడిన వ్యక్తుల, సంస్థల వదాన్యత చిరస్థాయి కాగలదు. దరిమిలా మహిళాసేవకని ఏర్పడిన సంస్థలకిది ఆదర్శప్రాయమైనది.

మద్రాసు సేవాసదనము, దానియడుగు జాడలలో అనాధలగు మహిళల అభివృద్ధి అభ్యుదయాలకు పాటుపడుతూ సేవచేయుచున్న సంస్థలు కలకాలము వర్ధిల్లి జాతీయసౌభాగ్యమునకు తోడ్పడుట మున్మాటికి వాంఛనీయము.

---

## అన్ని ఆసుపత్రులలోను కుటుంబ నియంత్రణాన్ని గురించి సలహా యివ్వాలి.

## కేంద్ర ఆరోగ్యమంత్రి ప్రసంగం

"కుటుంబ నియంత్రణ ప్రక్రియను గురించిన సమాచారం అందరికీ తెలియాలంటే, ప్రతి ఆసుపత్రిలోను, డిస్పెన్సరీలోను, ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలోను, మాతా శిశు ఆరోగ్య సంరక్షణ కేంద్రంలోను, అందుకు సంబంధించి సలహా యిచ్చే వైద్యులు ఉండాలి. అంటే ప్రతి వైద్యుడు ఈ రంగంలో ఇటీవల కనిపెట్టిన కొత్త విషయాలను, సాధించిన అభివృద్ధిని తెలుసుకున్నవారై ఉండాలి. అందువల్ల విరాళాల పద్ధతి ఆరోగ్య పథకం కింద పనిచేస్తున్న వైద్యులకు కుటుంబ నియంత్రణంలో శిక్షణ యివ్వాలని నిశ్చయించబడింది," అని ఆరోగ్యమంత్రిత్వశాఖ లేడీ హార్డింజ్ వైద్య కళాశాలలో ఏర్పాటుచేసిన కుటుంబ నియంత్రణ శిక్షణ తరగతి ప్రారంభోత్సవ సందర్భంలో కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీ డి. పి. కర్మార్కార్ ప్రసంగిస్తూ అన్నారు. ఈ శిక్షణ తరగతికి ఢిల్లీ పురపాలక సంఘాధ్యక్షురాలు శ్రీమతి అరుణ అసఫాలీ ప్రారంభోత్సవం జరిపారు.

ప్రజల జీవన ప్రమాణం పెరగాలంటే కుటుంబ నియంత్రణాన్ని అవలంబించడం అవసరమని, వైద్య సంస్థలు యితర విషయాలతోపాటు కుటుంబ నియంత్రణాన్ని గురించికూడా వైద్య విద్యార్థులకు బోధించాలని ప్రభుత్వం హెచ్చరిక చేసిందనీ, ఈ సలహాను అనుసరించి దేశంలోని వివిధ వైద్య సంస్థలు కుటుంబం నియంత్రణలో తరగతులను త్వరలో ప్రారంభించగలవని విశ్వసిస్తున్నాననీ మంత్రి అన్నారు. వైద్య సంస్థలు కుటుంబ నియంత్రణ చికిత్సాలయాలను ప్రారంభిస్తే ఇండియా ప్రభుత్వం వాటికి నూటికి నూరుపాళ్లు ఆర్థిక సహాయం చేస్తుందని కూడా ఆయన అన్నారు. బొంబాయి, రామనగరాలలో శిక్షణ తరగతులు ఇదివరకే ప్రారంభించారని, కుటుంబ నియంత్రణసంస్థ వారికి సంసార శిక్షణ బృందాన్ని ఏర్పాటుచేసే నిమిత్తం గ్రాంటు మంజూరు చేశారని, ఆయన తెలియజేశారు.

## శ్రీ విళంబినామ సం॥ర భాద్రపద, ఆశ్వయుజ మాసములు

| నెల | తేది | వారం | వివరములు |
|---|---|---|---|
| 1958 సం॥ సెప్టెంబరు నెల | 16 | మం | తది 12-49 చిత్ర 19-4 సువర్ణగౌరీవ్రతం, వినాయకచతుర్థి |
| | 17 | బు | చవి 6-42 స్వాతి 14-5 |
| | 18 | గు | పం 1-1 ఏష్యం 54-20 విశా 10-57 |
| | 19 | శు | సప్త 50-20 అనూ 7-30 |
| | 20 | శ | అ 46-11 జ్యేష్ట 4-40 |
| | 21 | ఆ | న 42-56 మూల 2-22 కేదారవ్రతం |
| | 22 | సో | ద 41-3 పూషా 1-35 క్షీరవ్రతారంభం |
| | 23 | మం | ఏ 40-36 ఉషా 1-36 |
| | 24 | బు | ద్వా 41-23 శ్రవ 3-34 వామనజయంతి |
| | 25 | గు | త్ర 43-36 ధని 6-22 |
| | 26 | శు | చతు 45-18 శత 8-51 అనంతవ్రతం |
| | 27 | శ | ○ పౌ 49-18 పూభా 13-36 |
| | 28 | ఆ | కృపా 54-4 ఉభా 19-20 |
| | 29 | సో | విది 59-17 రే 25-16 త్యాజ్యాభావః |
| | 30 | మం | తది 60-0 అశ్వ 31-58 |
| 1958 సం॥ అక్టోబరు నెల | 1 | బు | తది 4-72 భర 38-29 |
| | 2 | గు | చవి 9-10 కృత్తి 44-18 |
| | 3 | శు | పం 13-6 రోహి 49-10 |
| | 4 | శ | ష 15-49 మృగ 52-53 |
| | 5 | ఆ | స 17-41 ఆర్ద్ర 55-45 |
| | 6 | సో | అష్ట 17-53 పున 56-1 |
| | 7 | మం | నవ 17-15 పుష్య 56-51 |
| | 8 | బు | దశ 15-0 ఆశ్రే 55-39 |
| | 9 | గు | ఏకా 11-56 మఘ 53-31 |
| | 10 | శు | ద్వా 7-44 పుబ్బ 50-40 |
| | 11 | శ | త్ర 2-42 ఏష్యం 54-40 ఉత్త 46-45 మాసశివరాత్రి |
| | 12 | ఆ | ● అమా 51-50 హస్త 43-8 |
| | | | **ఆశ్వయుజ మాసము** |
| | 13 | సో | శుపా 45-37 చిత్త 38-46 శారదా నవరాత్రారంభం కలశస్థాపనం |
| | 14 | మం | విది 39-44 స్వాతి 34-43 |
| | 15 | బు | త 33-55 విశా 30-34 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట. కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మా నేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

